# గర్వభంగము

ఇందు

1 బలరామ గర్వభంగము

2 గరుడ గర్వభంగము

3 సత్యాగర్వభంగము

4 ఆంజనేయగర్వభంగము

అను నీనాలుగు నాటకములు కలవు

గ్రంథకర్త:

అయినాపురపు

సుందరరామయ్యగారు

1929

CI

# శ్రీయుత అయినాపురపు సుందరరామయ్యగారి

## నవలలు.



నోటు ప్రతినవల యందును రత్నములవంటిపద్యములుకలవు


వెంకటరమణ అండుకో,

కొమరిపాలెం,

గోదావరి.

శ్రీ రస్తు

# గర్వభంగము

నాలుగు అంకముల నాటకము



ఇది

శ్రీయుత "అయినాపురపు సుందరరామయ్య" గారిచే

రచియింపఁబడినది



ప్రకాశకులు-

కురుకూరి సుబ్బారావు

సరస్వతీబుక్ డిపో బెజవాడ

రెండవకూర్పు 1000 ప్రతులు

దేశబంధు ముద్రాక్షరశాల యందు ముద్రింపఁబడియె

రాజమహేంద్రవరము

1929



వెల రు0—12—0

B

# ఈ నాటకమందలి పాత్రలు

## బలరామగర్వభంగము

ఆంజనేయులు—శ్రీరామునిబంటు

నారదుఁడు—దేవఋషి

బలరాముఁడు—శ్రీకృష్ణునిఅన్న

శ్రీకృష్ణుఁడు—ద్వారవతికి రాజు

సాత్యకి—రామకృష్ణులతమ్ముఁడు

మురహారుఁడు }
హయగ్రీవుఁడు } దండనాయకులు

## 2 గరుడగర్వభంగము

గరుడుఁడు—విష్ణునివాహనము.

శ్రీకృష్ణుఁడు—

సత్యభామ—శ్రీకృష్ణునిభార్య

ఆంజనేయులు

## 3 సత్యాగర్వభంగము

శ్రీకృష్ణుఁడు

సత్యభామ }
రుక్మిణి } శ్రీకృష్ణునిభార్యలు
జాంబవతి }

## 4 ఆంజనేయగర్వభంగము

ఆంజనేయులు

శ్రీరాముఁడు—అయోధ్యరాజు

సీత—శ్రీరామునిభార్య

శ్రీరస్తు

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# గర్వభంగము



నాంది.

ఉ. కేలను పగ్గముల్ గొని యొకించుక గాళ్ళను సాచి ముందుకు
య్యాలను నూఁగుచుండ వెను కందున దొంగిలి పాటు నిల్చి ల
క్ష్మీలలనూఁచు వ్యాజమున జేతులు కక్షయుగంబు నందు జొ
న్పాల కుచద్వయం బదిమి పట్టుచు నూఁచుచు కేళిసేయు గో
పాలుఁడు భక్తపాలుఁడు కృపామతి సభ్యుల కిచ్చు కోరికల్.

(నాంద్యానంతరమున నటీసూత్రధారులు ప్రవేశింతురు)

నటి—దేవా! యీనాటకము రక్తికట్టించుట దుస్తరమని నా యభిప్రాయము.

సూత్ర—సఖి! ఏమిది ముందుగనే యిటులాడుచుంటివి. ఈ నాటకకర్త యెవ్వరో యెఱుంగుదువా ?

నటి—ఎప్పుడయితే నాందీపద్యము శ్రీవేణుగోపాలమూర్తిని గూర్చి వ్రాయబడియున్నదో అప్పుడే నాకు స్ఫురించినది. ఆమహానీయుఁడీయాంధ్ర ప్రపంచమునకు ప్రాతవాఁడుకాని క్రొత్తవాఁడు కాఁడు. ఇంకామీఁకు వివరము వలయునంటిరా వినుండు:—

సీ. బూతిగుండెను సహా లక్కాగా గరగించు
రహిం లాలు గోహరు వ్రాసినాడు
యతులకు మతిఁగూడ వ్యామోహమున ముంచు
వహిం గూల్చకావలి పన్నినాడు

సవరగా మదికెంతో నవరసంబులు గుల్క-
మించు మువ్వ్రజి రచించినాడు
కనని వినని వింత కల్పనల్ కొని ప్రీతి
జ్ఞాపాండవంబు నొనర్చినాడు
తే. స్త్రీలకు సతీత్వ మొరులకు దేవభక్తి
వెలుగఁ గృష్ణవిలాసంబు చేసినాడు
గోపబాలుని భక్తుఁడై నాపురాన్వ
యుండు సుందర రామయాఖ్యుండు సఖుఁడ.
ఇంకామహానీయుని కవిత్వశైలి యంటివా?

ఉ. నెచ్చుపుటంబు లెంతయును బెట్టిన కొద్ది పసిండిమేల్మిరై
హెచ్చగు గాంతిఁగల్గ మరి యేకడ లేని మృదుత్వ మొంది క
మ్మచ్చున తీఁగతీయ కొలఁదంచము సున్నిత మబ్బి సాఁగున
ట్లచ్చుగ నుండు వీని కవ నాద్భుత ధోరణి యన్ని రీతులన్.

సూత్ర—[సవిస్మయ] చెలీ! యీకవియొక్క కవిత్వమును గూర్చి యద్భుతముగా వచించుచుంటివి. క్రియకు నాటకము కళ కట్టదనుచుంటివే! యేమీ యీవైచిత్రియము అంకవిభజనము రంగసణాతి, పాత్రౌచిత్యములు సరిగా నుండవనియా?

నటి—ఎంతమాట! ఆవిషయములో నీతని కందినవారలు లేనే లేరు.

సూత్ర—ఎందుల గురించి వచించుచుంటివి?

నటి—ఎందునుగూర్చి యనుచుంటినా? ఇది కేవలము రౌద్ర రస పూరితమైన నాటక రాజము—ఈతని కవనాచమత్కృతి శృంగార రసప్రవాహమందస్ఫూను ఎట్లుంటిరా?

ఉ. తీరుగ జన్మమధ్యమున స్త్రీలను గాంచని వారికైన సహా
బోసగ మక్ఖలించు ప్రస్రో. సుంచు వసుగాసమ్మెత్రు శృం [illegible]

గార రసంబు వ్రాయుట నిగారవు సొమ్మగు నీని హాస్యవిం
కారపమున్ వినా చోరవ దన్యరసంబుల యందు నెంతయున్.

ఆ కారణంబున కళ కట్టదేమో యని యంటిని.

సూత్ర—[వికటముగా నవ్వి] ఇదియా నీయూహ. అబలవు గాన దుర్బలమగు నూహచేసితివి. మహాకవుల కీరసమారసము నీవర్తన నావర్ణనాయని యున్నదనుకొంటివా! వారి కలమునకే నన్నలు నేరసంబు లడ్డవు. ఆసంగతి నేవచించనేల నాటకానంతరమున నీకే విదితమగును,

(అంత తెఱలో రివ్వుమని ధ్వని)

నటి—[నైకిజూచి] దేవా! అల్లదే వాయుజుండు నభోమార్గమునుండి ద్వారకకు వెడలుచున్నవాఁడు. నాటకపు పాత్రలు రంగస్థలమున బ్రవేశించు చున్నయవి. రండు వెడలుదము.

సూత్ర—మంచిది.

(ఇరువురు నిష్క్రమింతురు)





శ్రీ రస్తు.

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# గర్వభంగము

## బలరామగర్వభంగము.

## ప్రథమాంకము.

---

ప్రథమరంగము—ద్వారకబయలు.

(ఆంజనేయులు ఆకసమార్గమునుండి క్రిందికి దిగును)

ఆంజ—(ఆశ్చర్యముతో) ఆహా!

ఉ. ఉన్నతమౌ ద్రుమంబులు, మహోన్నతమౌ నగరాజ పంక్తి, య
త్యున్నత శృంగవర్గము, సమోన్నత ప్రస్థచయుంబు, దీర్ఘమౌ
లిన్నని నిర్ఝరంబులు నదీనదముల్ గుహ కందరంబులన్
జెన్నువ నెన్న యోధ్యపురి చెల్వము తీరుగ నున్నదేకదా ?

ఏమీ? యీయద్భుతము [తలపంకించి) ఆద్భుతమునకేమున్నది యిది తప్పక అయోధ్యాపురియై యుండవలె. (కొంచెము నిదానించి) కాకేమి? యిది తప్పక దశరథ రాముని ముఖ్యనగరమే కాకుండిన కించెతయినా వ్యత్యాసముండదా? (సంతోషముతో) బలే! బలారే!! భళిరా!!!

సీ. భరతుఁడు ఛత్రంబు బట్ట సుమిత్రాత్మ
జులుహాయిహాయిగ సురటివీవ
వామభాగంబున భూమిజ కూర్చుండ
కపులు రక్కసులు ముంగలనునిల్వ

కైక సుమిత్రయు కౌసల్య హర్షింప
వానర రాక్షస ప్రభులుకొల్వ
పవనుఁడొత్తంగను పాదద్వయంబును
తపసులు వేదమంత్రములు జదువ

తే. సురలు సురవృష్టి గురియింప సొంపుమీర
నప్సరలు నాట్యమును సల్ప నద్భుతముగ
ద్రుహిణ రుద్రుఁడు దిక్పతుల్ స్తుతియొనర్ప
కంటి రాము పట్టాభిషేకమున పురిని.

ఆహా! యిప్పటి కెంత కాలమైయుండును? [తలపంకించి) అది త్రేతాయుగము. ఇది ద్వాపరము. (మరల తలపంకించి) ఓహో! సరే శ్రీరామచంద్రమూర్తి తన పట్టాభిషేక కాలంబున వానరుల కంద రకు కోరిన వరంబులు కూర్చియున్నవాఁడు, నే నప్పుఁడిట్లో:—

తే. స్వామి! మీదర్శనము వేండి వలయునన్న
ద్వాపరంబున కృష్ణావతారమందు
జమను రామావతార దర్శనము నిత్తు
నంచు వరమిచ్చె చేరువ యయ్యెనద్ది.

ఆమహనీయుఁడు సెలవొసంగిన గడువు నేఁడు కాదుకఁదా? (గిర్రుమని ధ్వని వినబడును. పైకిఁ జూచి) ఓహో! యెవరో విమానము పైనుండి యరుదెంచుచున్నవారు. [illegible]ముఁడా, రఘురాముఁడా, దశరథ రాముఁడు, శ్రీరాముఁడు కాదుకఁదా (పైకి చేతులెత్తి నమస్కరించుచు)

ఉ. రామ! దివాకరాన్వయవిరాజితసోమ! అమర్త్య సంచయం
బోమలలామ! దైత్యులమదోద్ధతి బాహగభీమ! భక్తులం
దామెతమైన ప్రేమ గుణ ధామ! అయోధ్యకు సార్వభౌమ శ్రీ
రామ! బొహరు, జోత రఘురామ శుభంకరనామ రాఘవా.

(ప్రవేశము నారదుఁడు)

నార—(స్వగతమున) కలహ భోజనము లేక నీమధ్య మనసు వ్యాకులముగా నున్నయది నేడుకదా సుదినము. నాచమత్కారము వలన యీకపినాయకునకు నాద్వారకా నాయకునకు పోరు గల్పించెద (సమీపించి ప్రకాశముగా) ఓహో! కపివర్యా! ఏమీ యిచ్చట సంచరించుచుంటివి?

ఆంజ—ఓహో! నారదమౌనీ! ఇది రాముని నగరమగు అయోధ్యాపురికదా?

నార—(నవ్వి) ఏనాటి అయోధ్య? ఏనాటి రాముఁడు అది త్రేతాయుగమునాటి చర్య. ఇది ద్వాపరయుగము.

ఆంజ—(ఆశ్చర్యముతో) ఆ! యేమీ! యిది అయోధ్య కాదా?

నార—కాదు ముమ్మాటికిని కాదు.

ఆంజ—మహాత్మా! మీరట్లు కాదని వితర్కించిన నేనేమి మనవి చేయఁగలను.

నార—హనుమా! అగుననుటకు నీకేమైనను గుర్తులు కలవా?

ఆంజ—లేకేమి? యిటు వినుడు.

ఉ. సీతమతోటి రాముఁడభిషేక మయోధ్యను బొందునాఁడు నే
బ్రీతిమెయిన్ జరించితి విభీషణు సూర్య తనూజుఁడాది ప్ర
ఖ్యాత కపీంద్ర నాథులతో నాగిరియందున, స్నానమాడితీ
పూఁత నదీజలంబుల నపూర్వముగా దిరుగాడితివ్వనిన్.

కావున యిదితప్పక రాముని నగరమే యని నాయభిప్రాయము

నార—నీవునాడు సంచరించిన నగర మీనగరముకాదు. ఇది గోవర్ధనగిరి నీవు స్నానమాడినది సరయూనది. ఇది యమున. నీవుతిరిగినది అయోధ్యాప్రాంత వనభూమి. ఇయ్యది ద్వారకాప్రాంతము.

ఆంజ—దేవఋషి! యిదే ద్వారకానగరమా!

నార—అవును

ఆంజ—దేవా! దీనికధిపతి యెవ్వరు?

నార—ఎవ్వరా? ద్వారకను గాంచి అయోధ్యయని భ్రమజెందినట్లుగా నీవీరస్వామి నామము విని మీస్వామి నామ మని భ్రమించక మానవు. కానీ రెండక్షరము లాతనికంటె యీతని నామము నందధికము

ఆంజ—(ఆశ్చర్యములో) ఏమీ! యీపురాధీశుని పేరు రాముడా

నార—ఔను కాని రెండక్షరము లెక్కువ యున్నవంటినికదా

ఆంజ—అవి యేవో వచింపుడు

నార—వచించిన పిమ్మట నీకాగ్రహము వచ్చునేమో;

ఆంజ—ఎందులకు?

నార—ఎందుల కంటివా? మీ రామునికంటె యీమహనీయుని నామము "రామ" శబ్దముతో నొప్పినదైనను "బల" శబ్దము గల రెండక్షరము లానామమునందుండుటచే నీకు కోపము వచ్చునని జంకుచుంటిని

ఆంజ—ఆ తెలిసినది "బలరాముడ" నియా పల్కుచుంటిరి. ఎందులకీ బలశబ్దము?

నార—వైయాకరణ వేత్తవు. మహాపండితుడవు. నీకు బలశబ్దము కర్థమే తెలియదా?

ఆంజ—తెలియకేమి! మిగుల బలశాలియని. అయితే యీనామము పుట్టుకనామమా? లేక పెట్టుక నామమా? మా రామునికంటె యెక్కువ బలశాలియా? ఆతడు చేసిన మహాకృత్యము లెవ్వి?

నార—శ్రీరామచంద్రుడొనర్చిన మహాకార్యములను నేకరవెట్టుచు తనవాత నీతని చరితము తెల్పెదను.

ఆంజ—అయిననిచో వినుము.

సీ. సిగ వేయుటకు కురుల్ చేకూరని యపుడె
తాటకి యను దాని గీటడంచె
ధర తప్ప టడుగులు సరిగ వేయక మున్నె
గాధేయు సవనంబు గాచెనమ్మ
శరములు మింటికి కూర్చుసరణి యుంగని నాడె
అలసుబాహుని దెబ్బ కిలను గూల్చె
నూఁగు మీసము కాంతి బాగ తేలెనొ లేదొ
హరు విల్లు పుష్పముగా విఱచివైచె
తే. ఇరువదొక్క సారి నృపతుల శిరచయంబు
తఱిగిన పరశురాముని గరువ మడచె
రాముఁడన కేవలము పరబ్రహ్మ మరయ
ధాత్రి దుష్టశిక్షణ కవతార మెత్తె.

నార—ఓహో! పావనీ! రాముని కథ యెంత విన్నను వినవలె ననియె తాత్పర్యము. ఏదీ! యింకా నామహాను భావుని పరాక్రమవిక్ర మము నాపాపిష్టి వీనులయందు జొప్పించి పవిత్రునిగా నొనరింపుము?

ఆంజ—ఋషివర్యా! ఆమహనీయుఁడు తండ్రి యానతి మెయి దండకాటవి కేగి నాతియగు మహీజాతతోను; భ్రాతయగు లక్ష్మణుని తోను పర్ణ కుటీరము నుండుతఱి:—

సీ. ధర పదియార్వేల ఖరదూషణాదుల
ముంజి ద్రోలక లట్లు పుచ్చెలుండ్చె
మాయల మారియా మారీచు క్రోధసులో
బడునటుల్ దెబ్బకు వడగ జేసె
బలశాలి యని ఖ్యాతి వడసి చరించిన
వాలి నొక్కమ్మకే కూలఁగొట్టె

గొప్ప గొప్పలలచే నొప్పారు నుదధిని
కాలువరీతిగా గడచిపోయె
తే. యక్ష గంధర్వ సుర సిద్ధు లడల జేయు
లోక కంటకు దశకంఠుఁ దుంచివైచె
రాముఁడన కేవలము పర బ్రహ్మమరయ
సాధ్వి భూజాత నిజముగా జగముతల్లి.

అట్టి మహాత్ముఁడే రాముఁడను నామముతో మెలఁగియుండఁగా బలరాముఁడని పేరు బెట్టుకొనిన యీతఁడెంతటి మహాకృత్యము లొనర్చి యుండెను? అవి యెవ్వియో కొద్దిగా నానతిప్పింపుడు.

నార—(స్వగతముగ) ఆరాముఁడే యీబలరాముఁడని వచించిన యిఁక నాకు రంగమే లేదు. కావున యుక్తిగా పోరాటము కల్పించవలె (ప్రకాశముగా) వానరేంద్రా! శ్రీరామచంద్రుని బాహుబలము గుణాతిశయంబులు నెఱుఁగని వారు లేరు. ఆమహనీయుని చారిత్రమేకదా గొప్ప రామాయణ గ్రంథమై లోకమంతయు ప్రకాశించుచున్నయది. ఆ మహనీయునికి మ్రొక్కని వారలు లేనే లేరు. అతని నేదైవాంశ సంభూతునిగా నెంచుచున్నవారు. అట్టివానికే "బల" శబ్దము లేదు గాని:—

తే, వృషభ ధేనుక దైత్యులం దిరుపురోనా
బక్కరక్కసులను నాతఁ డుక్కడంచె
నంతేమాత్రాన బలరాముఁ డనుటదెట్లు
రామునకు సాటియే బల రాముఁడెందు.

రామునకు బలరామునకు ప్రతి యంశమునందును హస్తిమశకాంతరము లేదా కలదు. హస్తిమశకాంతరమే కాదు. కొండకు గోపురమునకెంత వ్యత్యాసమో అంత వ్యత్యాస మిరువురందును కలదు అంతియేకాదు మహానదికిని పిల్లకాలువకెంత తారతమ్యమో యంత తారతమ్యము కలదు. రాముఁడెక్కడ బలరాముఁడెక్కడ!

ఆంజ—(పక పక నవ్వి) దేవా! ఋషివర్యా! బహుచక్కగా యోచించితివి. "బలహీనునకు బడాయిమెండు" అనిన తెలుఁగున నింకా యీతనికి పౌరుషనామము లున్నవా?

నార—(నవ్వి) వైయాకరణపండితోత్తమా! లేకనేమి? వినుము

క. బలభద్రుఁడు బలదేవుఁడుఁ బలరాముఁడు
బలుఁడటంచు పౌరుషనామం
బులు కలవా పైనెంచుము భళిభళి!
వాని బలశౌర్యపటుసాహసముల్.

ఆంజ—(కోపముతో) యేమేమీ! బలదేవుఁడంటివే! యీతఁడు దేవుఁడా? ఏమీ యీయాశ్చర్యము! అన్నా! ఏమి విపరీతము!

ఉ. భృత్యులుగాఁ, నమర్త్యులనె యేలినట్టి దశాస్యుఁడైన యా
దైత్యనృపాలునిం దునిమి ధాత్రికి మేలొనఁగూర్చు రాముఁడా
దిత్యుఁడు గాక జావునకు డీకొన రక్కసులొక్క రిద్దరిన్
మృత్యువు వాతవేయునతఁడే బలరాముఁడు దేవుఁడాతఁడే!

మానీంద్రా! నిజముగా నీ బలదేవుఁడే దేవుఁడైనచో పాదధూళిచే ఱాతిని నాతిగా నొనరించి, అతిబాల్యముననే శివుని విల్లు పుడకగా విఱచి; భూలోకమాతయగు సీతను చెట్టవట్టి సత్యవాక్పాలనకై కానలకేగి ఖరదూషణాది సేనవేల రాక్షసులను ద్రుంచి ముల్లోకకంటకుఁడగు పంక్తికంఠుని పుత్రమిత్రబంధువర్గముతో బరిమార్చి మహామునులకు మహోపకారమొనర్చి పట్టాభిషేకకాలంబున దేవతలచే మహేంద్రాది దిక్పాలురచేత నీజగత్ప్రఖ్యాతియగు సృష్టిలయకారకుండగు మహేశ్వరునిచేత నుతిగన్న మాదశరథరాముఁడు, మాజానకీరాముఁడు మాజేజెయిరాముఁడు, మారాముఁడు, మారాఘవరాముఁడు, మాసాకేతరాముఁడు, మత్ప్రాణదైవమగు శ్రీరాముఁడు, మాస్వామినియే! దైవమని చెప్పవచ్చును? దేవాదిదేవుఁడని వాక్రుచ్చ

నా! లేక త్రిమూర్త్యాత్మ కస్వరూపుఁడని యెంచఁబడిన దత్తాత్రేయ మూర్తికిఁ గూడా పైవాఁడని వచింపవచ్చునా? లేక యఖిలాండ కోటి బ్రహ్మాండములకంతకు గొప్పకాంతి నొసంగెడు పరంజ్యోతియని పల్కనా? ఆహా! రామశబ్దమునకు ముందు "బల" శబ్దముండుటయే ప్రాణకంటకముగా నుండఁ పైగా "దేవ" శబ్దము కూడా యుండినటుల వ్రాసిచ్చితిరే అన్నా! నామదిలో కోపాగ్ని ప్రజ్వరిల్లుచున్నది (పండ్లు పటపటకొఱికి) హా! నాయొడలంతయు భగ్గున మండుచున్నయది. నాస్వామికంటె, నాప్రాణదైవముకంటె, నాదేవాది దేవునికంటె, వేఱొక దేవుఁడు వేరొక బలుఁడున్నాఁడా? [దంతములు తటతటి] కానీ యాబలము యాదైవశబ్దము యొక్క చేవఁ జూచెదగాక, దేవా! ఋషీంద్రా! ఆబలుఁడను వాని చెంతకేఁగి యిట్లని పల్కుము

మ. బలరాముండను నేనని "బల" శబ్దం బొప్పుగా దీసి తా
నిల రాముండను పేరితో మెలఁగగా నిచ్ఛించునో లేని నో
గలుఁడం జూచునొ చేయి, రెంట నెదియో కానోన గాఁ గావుఁడౌ
దెలుఁపన్ వేడెద సీరపాణి తలఁపే తెంచెన్వాడే తాపసా!

నారద—(స్వగతము) బాగుగా కోపము పురెక్కించితిని. ఇక సమరము జరుగుటకు సందేహము లేదు బలరామశబ్దములో "బల" శబ్ద మాత్రము తీయుఁడు. సరే (ప్రకాశముగా) పావనీ! స్వామిభక్తి యన్న నీయదియే, వహ్వా! నీప్రభు పరాభవము నీయది కాదా? నీయట్టి భక్తాగ్రేశ్వర చక్రవర్తిని, నమ్మినబంటును త్రిభువనములయందును జూచియుండలేదు. బలే! నీసామర్థ్యమును నీయెదుట పొగడిన స్తుతి పాఠముగానుండును ఐనను వినుము:—

క. పుట్టీ పుట్టుటలోనే పట్టుగ
రవి బింబము పండను భ్రమతో.

మిట్టితివి దివికి సాగర,
మిట్టే దాటితివి లెక్క యితఁడన నీకున్.

కావున వాతనితో పోరాటము నీకు బాలురతో చలగాటము వంటిది

ఆంజ—ఋషివర్యా! జాగేటికి? వేగముగాబోయి "బల" శబ్దముతొలగించుకొనుటయో లేక కలహామునకే తెంచుటయో రెంటిలోనెద్దియేని తెలిసికొని రావేడుచున్నాను. హాం త్వర. త్వర.

నార—అంతవరకు మీరెచ్చటుందురు.

ఆంజ—అల్లదే! పర్వతశిఖరము దానిపైన విహరించుచుండెద.

నార—మంచిది (స్వగతమున) సరే! మన మనుకొనిన యట్లే కలహము జరుగుట యదార్థము. ఏమని?

మ. బలశబ్దంబును దీయనొల్లఁడు కదా వైకుంఠు సద్భాగ్యత, పో
కలుషంజూడక జేయిమానఁడు కదా కార్పణ్యతన్ వాయుజుం
డలరున్ ఘోరరణంబు యాదవకపీం ద్రాళీకకుర్కా వహ్వరే!
తెలుపన్ శక్యమెనాదు సంతసము ప్రీతిన్ తద్విచంబందునన్

(ప్రకాశముగా) కపీంద్రా! యిదే వెడలుచుంటిని. ప్రవిదారణమే ప్రధానమని యెంచుకొనుము.

ఆంజ—అటులైన మరీ సంతోషము. పదండి మిమ్మలను గొంతదూరము సాగనంపెద.

(ఇర్వురు నిష్క్రమింతురు)

(తెరవాలును)

---

## ద్వితీయరంగము.

ద్వారకానగరము—శ్రీకృష్ణునిమందిరము.

[ఉన్నతాసనముపై శ్రీకృష్ణబలరామ సాత్యకి నారదులు ప్రవేశింతురు]

బల—(మిగుల కోపముతో) మౌనివరా! ఏమేమీ? ఆకపి గాడు, ఆమర్కటాధముఁడు ఆకోఁతిగాడు నన్ను గూసిన కూఁతలను బ్రత్యుత్తర మీయ కూరకుంటిరా?

నార—ఏమని?

బల—ఏమని? అని చెప్పవలెనా? ఓయీ కొంటెమునీ!

ఉ. రామునికంటె యెందు బలరాముఁడు తక్కువ సాహసంబునా?
భీమ పరాక్రమ శౌర్యమున బింకపు పంకములోన, నెంచవాఁ
డేమహిమంబునం దతని కీడవఁడోక్కెఁ తక్క భార్యనా
రాముఁడు కోలిపోయె బలరామునకా యగచాటు లేదుగా

అని వచించలేకుంటివా? అప్పుడా కపిగాడు శిరమెక్కడనో పెట్టుకొని సగముచచ్చిన వానివలె నోరు నొక్కుకొని యూరకుండడా

శ్రీకృ—అగ్రజా! నీవాడిన మాటయే నాతని చెంత నారద మౌని వచించిన మనదగ్గఱి కేతెంచి తిరుగ జవాబు చెప్పకెక్కడిది? వాలముతోఁ జుట్టి యేవార్ధికినో విసరకుండునా వి[illegible] [illegible] [illegible] చర్యలు.

సీ. అవలీల యుదధినే, జవమొప్ప చిటికెలో
ధర బిల్వకాల్వట్టు దాటినాడు
అన్ని యిన్నని జెప్ప నలవికానట్టి బల్
కొండలు చెండ్లట్టుకొన్నవాఁడు
రావణు కంటెను లక్ష మాయలు గల
మైరావణుని కసి మసఁగినాడు
ఒక్కఁడే లంకలో నొప్పారగాఁ జొచ్చి
పెక్కుదైత్యుల బలి పెట్టినాడు

తే. గీ. అధిక బలశాలి రాముని కతసి వలన
ఖ్యాతి తనరారె యదిగాక కామరూపి
వ్యాకరణవేత్త తత్త్వజ్ఞుఁడమల గుణుఁడు
వానితోఁబోరి గెల్చుట వట్టిదనఘ.

ఆతనికి ప్రత్యక్షదైవము శ్రీరామమూర్తి.

సాత్య—అగ్రజులారా! పెక్కుసారులు రామాయణ గ్రంథమును చదివినవాఁడగుటచే నాకాహనుమ భుజాశక్తి గాథ్య్యమే వేయేల? హనుమంతుని వలననే రామాయణగ్రంథము వెలువడినదని చెప్పవచ్చును ఏమంటిరా? ఆహనుమ,

సీ. అర్కవంశీకునకర్క తనయునకు
గా రాము చెల్మియే కలుపకున్న
అంభోధి లంఘించి అవనిజ వృత్తాంత
మెలమి రాముని కప్డు తెలుపకున్న
సౌమిత్రి మూర్ఛకై రాముఁడు విలపింప
వీకతో సంజీవి తేకయున్న
రామునాలన్యము రాకకీలుగుటను
నెలచు భరతు కడ కేగకున్న

తే. గీ. కలదె రామాయణంబను గ్రంథరాజ
మంత యుత్కృష్టమౌ గాథ యదరుటనును
మిగుల రక్తిగా యుక్తిగా నెగడుటకును
హనుమపాత్రియె కారణం బనఘ వింటె.

బల—(కోపముతో) అబ్బో! యీపలుకలకేమి? నావ పిరికి మందు పోయుచుంటిరా? ఏమేమీ? నేనుమాత్ర మెంతమంది రక్కసుల నుక్కడగించితిని?

ఉ. దెబ్బకు నీల్గడే ధరను ధేనుక దైత్యుఁడు వత్సుఁడొక్కఁడే
బొబ్బకు భీతిఁ జెందడలి భూమిని కూలె ప్రలంబదానవున్

జెబ్బలువట్టి నేలఁబడి చిప్పగగొట్టి గతాసు చేయనే
అబ్బుర మొందరే ఒకుని అజ్జలుకట్టుక జీల్చి త్రుంచగా.

[నారదుని వంకఁజూచి]. ఋషీంద్రా! యిం దతిశయోక్తి యేమున్నది?

నార—అవును నిశ్చయమే (పెదవి విఱిచి) కాని యాతఁడు వేనవేలు. మీ రన్ననో లెక్క రక్కసులను నలుగురునో పదిమందినో జంపియుందురు.

సాత్య—అగ్రజా! నీవు కోపించిన నేవచింపఁజాలను గాని ఆ యంజనీతనయునిచర్య రామాయణ గ్రంథ రాజంబున చదువఁగా, నాతఁడు దైత్యుల పాలిట మృత్యుదేవతయని వచింపఁగు.

ఉ. వాలమునందు దైత్యులను వంకలు వేలుగ జుట్టి వార్థికా
లీలగవైచి చంపెను ధరిత్రిని గొట్టి వధించి నట్టి దై
త్యాళికి లెక్కలేదు పదునా పాతికి వరి ముష్టి ఘాతకున్
గూలిన రాక్షసాధములు కోటులు మేటులటంచు నెంచనౌ

ఇందతిశయోక్తియుండెనేని హనుమ సీతను గాంచిన పిదప అశోకా వనధ్వంస ప్రకరణము, లక్ష్మణమూర్ఛ కాలమందు కాలనేమి మున్నగు రక్కసులను బరిమార్చినచర్య, మూల బలనాశనము మొదలైన శాఖలను రామాయణ గ్రంథమును జదివిన మీకేవిదితమై యుండు

శ్రీకృ—అగ్రజా! ఆతఁడు త్రేతాయుగము వాఁడు మనము ద్వాపరము వారలము. యుగ వివక్షతను బట్టి చూడ వానికున్న బలము, తేజము, సాహసము, ఆయువు మన కుండదు.

చ కృతముకంటె త్రేతమను నెన్నఁగ త్రేతము కంటె ద్వాపరం
బతులిత ద్వాపరంబు కన నాలిమనమున మనుమ మర్త్యు

తతికిని నాయువుఁ బలము ధైర్యము లాది క్రమక్రమంబుగా
గతమగు గాన నాహనుచు కందము పోకనకూడ నెంతయున్

గావున నేదోవిధముగా నాతని సమాధానము పెట్టి పంపుట మనకు శ్రేయము.

బల—(లేచి కోపముతో) అనుజా! ఏమిది ప్రాకృతునివోలి నిట్లు పల్కుచుంటివి? ఒక్కకోతిగాడు వనచరుఁడు అవతారమూర్తులమగుమనలను అహంభావముచే దిరస్కరింపుచుండ నెన్నఁడో జన్మించ వానిగతిగా నూరకుండ మనియెదవా! ఏమీ నీయభిప్రాయము. "బలరామ" శబ్దములో "బల" శబ్దము తొలగించుకొని వట్టి "రామ" శబ్దముతో మెలంగ మనియెదవా? లేక రామ శబ్దము స్త్రీలింగముగా మార్చుకొని గాజులు తొడిగించుకొని యింట కూర్చొనమనియెదవా? ఎంతసిగ్గు, ఎంతలజ్జ! పాటివారలు విన్న నవ్వరా? ఓయీ నారదా! బుద్ధి విశారదా! ఇదే వినుము.

మ. బలరాముండను పేరునందు బలశబ్దంబొప్పగా దీయనే
హలముం జేకొని యిట్టి తుచ్ఛపుగు వాక్యంబుల్ ప్రలాపించునా
ఖలు మూర్ధంబొకపెట్టుతో నినుము నే ఖండంబు లౌనట్లుగా
సలుపన్ కుండిన నీరపాణిని చిఛీ శాఖామృగక్షుల్లకా!

ఓయీ! నీవుపోయి నామూగ్ఘని యుద్ధసన్నద్ధునిగా రమ్మను. సాత్యకీ సేనాసమేతుండవై పైనముగమ్ము తమ్ముఁడా! నా వెన్నంటు దవా? లేక నింటను గాచుకొనియుండెదవా?

నార—(స్వగతమున) సరే మన మనుకొనినయట్లే సంగ్రామము జరుగుటకుసంశయములేదు (ప్రకాశముగా) దేవా! శ్రీకృష్ణా! నన్ను మీరలుకలహకారణుఁడనివచించినను సరే కాని యాకపిగాడు క్రిందు మీఁదెఱుంగక "బలరామ" శబ్దమునుండి "బల" శబ్దము తొలగించ వలసినదని పేలిన ప్రలాపములు విన్నట్టి నామనమె క్రోధానలముతో మండిపోవ నిశ్చయము గానా సమయంబున నీబలదేవుఁడే

యచటనున్న హాలముకొలఁది శిరముపై బెట్టినురిమాటాడకుండునా; మీరెక్కడ? వాఁడెక్కడ? హా స్తిమశకాంతరము.

ఉ. మీరవతార మూర్తులు అమేయులు నవ్యయు లప్రేయులా
 ధారులు నీజగత్త్రితయ ధారణకట్టి మహాత్ములైన మీ
 తోరణ మాచరించుటకు తూకొన నెంచుట యానలీముఖుం
 డూరక నేలఁబోవునది యొయ్యన నెత్తికి ప్రాకుకొంటయే.

కాక వానికట్టి గర్వమూ! మిగుల శాంతమూర్తులును దిగంత యశో విశ్రాంతకీర్తులునగు శ్రీరామమూర్తికి బంటుకింద బంటునై యుండి యిట్టి తొందర వాక్యంబులుచ్చరించి సంగరంబునకు డీకొననెంచుట యారాజేంద్రుని కీర్తికి భంగము కాదా.? దేవా ! యిప్పట్టు నాకపిగాని గర్వ మణంచుకుండా యుండరాదు..

సాత్య—యిట్టిపడు వాఁడే గిట్టక మానఁడు

శ్రీకృ—(స్వగతముగ) ఇది "బలరామ గర్వభంగ" ప్రకరణ కఁదా! నేనీతని వెన్నంటిన అంది జరుగఁదు. కావున యుక్తిగా జవాబిచ్చి యొక్కనినే పంపెద (ప్రకాశముగా) అగ్రజా! మనకింకను వైరులు కలరు. మనమందఱ మొక్కపెట్టుగా నాప్లవంగాధముని తాకుటకై వెడలిన తలుపుతీసిన యింట కుక్కలు ప్రవేశించినట్లు వైరులు మన యంతపురఁ జొచ్చి అల్లరి చేయుక మానరు ఆ కారణంబున నేనింటివద్ద కాపుండెద. సాత్యకి పురిచుట్టు కావలి కాయు చుండును. మురహార హయగ్రీవ సేనానాయకులతో నావానరుని పొగరడంచుము. ఆతఁడు నీకు లొంగని యెడల నేనేవచ్చెద.

బల—(ఒక్కపెట్టున నవ్వి) తమ్ముఁడా ! ఎంతమాటాడితివి ! ఒక్కకోఁతి గానికై మీరింతమంది నావెంట రావలెనా? చూడుము:—

ఉ. వాలము బట్టి యెత్తి చను ఁ బలుఁగొట్టి యనంతరంబునన్
 లీలగ త్రిప్ప త్రిప్పచు త్రిప్పి ఘుమాయన నబ్ధి మధ్యకున్

గూల గిరాటు వేసెదను కూలి వికుంఠము సున్నగాము ముం
గాలను వ్రాలి మొత్తులిడ గ్రావలెగా బలరాము చేతకున్

(అనిలేచి) తమ్ముఁడా ! సాత్యకీ నీవు సమరభేరిని వేయింపుము. మురహరహయగ్రీవాదులకు కబురు పంపుము శ్రీకృష్ణా! అంతఃపురంబు నతి జాగరూకుఁడవై మెలంగుము, నారద మానీ ! మారాక యా కపిగానికి కృతపరచుము. జాగుసేయ వీలులేదు. రండు

తక్కినవారు—మంచిది

[అందరు నిష్క్రమింతురు]

(తెఱవాలును)

---

తృతీయరంగము.

ద్వారకానగరప్రాంతము—కొండలప్రదేశము

[ప్రవేశము. ఆంజనేయులు]

ఆంజ—(ఇటుఁ టుఁజూచి) ఏమీ యింకను నారదమౌని రానే లేదు.

మ. కలహంబందున చేయిఁగల్పుటకు గా గాంక్షించెనో లేదొ యా
బలరాముండతి భీతిజెంది బలశబ్దంబున్ దోలగింపఁగా
నెలమిన్ సమ్మతి నొందెనో యటులగాదేని చమూయుక్తుఁడై
అలుకన్ దాఁకగ వచ్చునో వినుట కత్యానంద మయ్యెం గదా.

[మరల యిటునటుచూచి) ఓహో! సరే అల్లదే మౌనివర్యుఁడ రుదెంచుచున్నవాఁడు ఏదోయొకటి యిప్పుడే తేలగలదు

(ప్రవేశము. నారదుఁడు)

నార—పావనీ! యీకాలములో మాటలకు బెదరు వారుం దురా?

ఆంజ—అనగా బలశబ్దము తొలగించుకొనుటకిచ్ఛించ లేదా?

నార—ఏలాగున యిచ్ఛగించును అతనికి హనుమ త్రేతాయుగమునాటి వాఁడనియును తాను ద్వాపరము వాఁడ ననియును తనకున్న బలము దార్ఢ్యము నీకుండదనియును మదిలో "ఊహ" పైకిమాత్రము:—

ఉ. త్రేతమునాటి వాయుజుఁడు తెంపున, ద్వాపర కృష్ణుడైన స
ద్భ్రాత ప్రియాగ్రజుఁడు బల భద్రునితో బలదేవుతోఁడ ని
ర్మాత్రిలయస్థితుండు బల రామునితోడ రణాభిధేయమున్
బ్రీతినిగోరగా నిడక వీడిన దిట్టరె పెద్దలిమ్మహిన్.

అని వచియించె.

ఆంజ—ఆ. అటులనా? నాకును భుజములు తీటగానే యున్నవి ఏలాంటి త్రేతాయుగము. ఎట్టి రామ రావణ సంగ్రామము ఆకాలమున నెన్నివేల నెన్నిలక్షల నెన్నికోట్ల దానవులను రూపుమాపి యుంటినో. యది గతించినది మొదలిప్పటివరకును చలిచీమునైనను జంపి యెఱుంగ. నేటికి మీదయవలన మహాశ్రీరామచంద్రుని యనుగ్రహమున బలరామాదులతో సంగ్రామము పొసగినది. ఆహా! యేమినా యదృష్టము?

క. రాముని భృత్యుఁడను పరశు,
రాము నెఱుఁగుదును పొందు ప్రిప్రియనుట మా
రాము నెదిర్చి పరే బల,
రాముని నేడుక నెదవగు రామ త్రికంబున్.

సరే అది యటుండనిఁడు.

ఉ. రాజులఁ ద్రెంచెగా బరశురాముఁడు చెండ్లతెఱంగు నట్టి వి
భ్రాజితశాలి యిట్టి రఘురాముని చే నవమాన మొందె యా
రాజసమూర్తికంటె బలరాముఁడు నెందున గొప్పవాఁడు స
త్తేజము నందునా మిగుల తేఁకువ నందున పీఁక యందునా?

ఏమీ? యుద్ధమనగా క్రీడజెందునని తలంచెను కాంబోలు. అట్టి శ్రీరామచంద్రుని భృత్యుఁడని యెఱుఁగఁడా!

నాగ—కపివర్యా! బలరాముని తలంపు వట్టిదిగా నెంచరాదు నీవు త్రేతాయుగము నాటి వాఁడవు. వృద్ధుఁడవు ఆకారణమున బలరాముని యొంటరివై యెట్లెదిర్చెదవు. యుద్ధనైపుణ్యముకూడా మఱచియే యుందువు.

క. రాముని దాడియనఁగ బల,
రాముఁడు తన సేనతోటి రణరంగములో
భీమపరాక్రమ విక్రమ,
రామ త్రితయంబుగతిగ రాచునునిన్నున్.

అనగా పరంపరలైన సైన్యముతో బలరాముఁడు రణరంగములో రాము, పరశురామ, బలరాముడనుమూఁడు రాములగతిగా తాకును. నీవేమిచేయఁగలవో నాకు దోచకున్నయది.

ఆంజ—అదియా! వీసంతయము నాకు ముసలితనము లేకుండగ బలము చెడకుండగా యుండులాగున మజ్జననియగు భూజాత, పట్టాభిషేక కాలంబున వరమిచ్చియున్నది అందువలన బలము చెడలేదు. ఇఁక సంగ్రామ నైపుణ్యము మఱచితివంటివా అస్త్రప్రయోగమసలే యెఱుంగను. శస్త్ర మెప్పుడును వినియోగించి యుండలేదు.

క. దైవమొసంగిన గాళ్ళను,
భావింపఁగ జేతులుండు బాణములేలా?

కావసిన రాలున్నవి,
దేవా వర్షింబు గతిగ తెగకురిపింతున్.
నాకురాళ్ళె బాణములు వృక్షములే ఖడ్గములు.

(అంత తెరలో కలకలము)

నార—సరే సైన్యము దాపయినది.

ఆంజ—ఇదే యీకొండ శిఖరము పైకిఁబోయి రాళ్ళవర్షముచే శత్రుహతంబు గావించెద. (అని కొండశిఖరమున కెక్కును)

నార—ఏనొక వియుక్తప్రదేశమున డాగి యీపోరాటము కనుల పండువగా గాంచెద. (అని నిష్క్రమించును)

(ప్రవేశము బలరాముఁడు మురహార హయగ్రీవులతో)

బల—ఏడీ కపిగాడు ?

క. మనరాకకు మనసాకకు,
మనవీఁకకు భయముచెంది మాయంబై యా
వనచర మెటకో తోఁకను,
ముణుచు కరిగె కాకయున్న పోరదె మఁతోన్.

ముర—దేవా! మురహరుని దెబ్బకు హరహరా యని యా హరి నేలఁ గూలకుండునా?

హయ—హయగ్రీవుని వ్రేటునకు రెండు తునియ లవకుండునా?

ఆంజ—స్వగతమున ఓహో! నేను పారిపోయితినని యెంచుచుంటిరి కాఁబోలు! సరే నేనున్నట్టు సూచింపఁజేయుటకై యీరాల వర్షము నొక్కసారి కురియింపఁజేసెద అని దడదడ రాలను రువ్వును.

బల—ఏమిటీ శిలావర్షము. అని [పైకిఁజూచును.]

ముర—(పైకిఁజూచి] అదిరా కోఁతిగాడు.

హయ—ఇదేమిటోయి నారదుఁడు వీనిని గూర్చియేన గోరంతలు కొండంతలుగా వర్ణించి యున్నవాఁడు

బల—ఓయీ! వనచరుఁడా! మాటాడవేమి? కపిగా!

క. నలుసంత కలవో లేవో
బలశబ్దము తీసి రాము వచనము పేరన్
మెలఁగెదవో లేకుండిన
కలహమునకు రమ్మటంచు కబురంపితివా

కానిమ్ము నీమద మడంచుటకై—

క బలభద్రుఁడు బలదేవుఁడు
బలరాముఁడు బలుఁడు వచ్చె బలమును జూఁపన్
బలిముఖ! రారమ్మదె నిన్
బలిపెట్టక విడడు బలుఁడు పాటిరగానీ.

నీవొక్క బలశబ్దము దీసికొన మంటివే! ఎన్ని బలిశబ్దములు చూపితినో చూఁడు. [హలము పైకెత్తి] ఇదిగో హలము జాగ్రత.

ముర—దేవా! యీకోఁతిరూప మందు మూరెసుపాదవు లేదు ఇటియా మనల నెదిరొక్కనుట. [పైకిజూచి] కోఁతీ! తిమ్మఁడూ! రావేమి? [అని కేకలు వేయును.]

హయ—ఓయీయామల్లు! మల్లుఁడనియా కజ్జాకు కాలు దువ్వుచుంటివి?

ఉ. గ్రామములన్ జరించుచును కాయలు పండ్లను మెక్కిహాయిగా
ద్రావుచు నిర్ఝరమ్ముల జలంబుల ద్రూకునుండి ద్రూకుకున్
శీవిగ దూఁకుచున్ మనక శ్రీకొని యీబలదేవుతో హయ
గ్రీవ మురారితో గలను కెంచుట మృత్యువు తెచ్చుకుంటయా.

నీపాపేము నేటితో బద్ధలైనవి రారమ్ము.

ముర—ఓరీ అటవి నట్టి! ఓరీ! వెకిరింత! ఓరీ! తమలమోర మొకమా!

క. మారాకకు భయమొందుచు
సౌరుగ మేనునకు సరికి శైలశిఖరమున్
దీరుగ జేరితి రారా
రారమ్ము పదమున నల్పి రాచెద నేలన్

[అని మీసము దువ్వి తన కాలు క్రింద బెట్టి రాసి చూపును]

ఆంజ—[స్వగతమున] వీరలు నన్ను దుర్బలునిగా యెంచి యన రాని మాటలనుచున్నారు. [ప్రకాశముగా] మురహర - హాయగ్రీవులారా!

ఉ. స్వేచ్ఛగ ప్రేల నేమిటికి శ్రీహరి వక్త్రి మొసంగె నంచునో
తుచ్ఛమనుష్యులార! అతి దుర్బలులార! ప్రగల్భులార! నా
పుచ్ఛము చేత మీకుతుకముల్ మూడి పెట్టి గ్రహించి యీమహా
కచ్ఛములోనికిన్ వయితు కట్టరసాతలమంటులాగునన్.

యిదే కాసుకొనుండు. (అని తన వాలము కొండనుండి మురహర హాయగ్రీవులవరకు బెంచి వారల కంఠమునకు బిగించి తన చెంతకు లాగుకొని] ఓరీ! దురాత్ములారా యిప్పుడు పేలుడు. మిమ్ములనీతాలపై బెట్టి యొక దెబ్బతీసి నడివార్ధికి విసరివైచెద బలరాముడు గిలరాముడు కూడా హాడలవలె. [అని వారలను గుంజును]

బల—[పైకిజూచి) ఆహా! వీడెవడో మహాసూరుడు వలెనున్నాడు అంతయెకాదు రాముడీతని ప్రత్యక్షదైవ మాకారణమున వీని కపజయ మనుమాటయుండదు.

ముర, హాయ—[గజగజ వణుకుచు) ఓయీ! కపిరాజా! వందనము

చ. ఎఱుఁగక నీమహత్త్వము కపీంద్ర! సహింపగరాని వాక్యముల్
త్వరపడి యాడినందులకు తత్ఫల మిప్పుడె పొందినారమా
పొరపడె బుద్ధిపండ్లగులుపొల్పున లెంపలు వాయఁగొట్టి మ
మ్మరతిఁ గోరిపుమయ్య శరణార్థుల మైతిమి వారిలితజ్జలన్.

ఇదే స..ము లంటితిమి. శరణుశరణు [అని పాదములు పట్టుసు]

ఆంజ—ఓయీ! సైన్యాధిపతులారా! ఎంతగట్టిగా ప్రగల్భము లను వచించితిరో అంత తేలికగా లొంగిపోతిరే.

ముర, హయ—అయ్యా! మూరెడు పైకెగయువాఁడె బారె డుక్రిందికి కుంగును.

ఆంజ—సరే! ముమ్మాటికి శరణమంటిరా?

ముర,హయ—ముమ్మాటికేకాదు పది ముమ్మారులకు కూడ

ఆంజ—(సంతోషముతో] పూజ్యులారా! మీతప్పులేదు మీరు మీస్వామికార్యార్థమై యేతెంచితిరి. శరణార్థులగుటచేమీరు పూజనీయులు.

ఉ. రాముని బంటు బంట రఘురాము పదాబ్జము గొల్చువాఁడ శ్రీ
రాము కటాక్ష వీక్షణ పరంపర కర్హుఁడ నేను గాన మా
రాముఁడు మున్విభీషణుని ప్రార్థన గాంచి శమించె అట్టి శ్రీ
రాము హితోపదేశ ఘన రక్షకుఁడై మిము నేఁడు వీడితిన్

పోపొండుఁ ఎన్నఁడిట్టి బుద్ధిహీనపుపల్కులాడకుఁడు [అని క్రిందికి దించివేయును]

ముర,హయ—బలదేవా! నమస్కారము. మేమిట నిల్వము.

[అని పాఱిపోవుదు]

బల—[స్వగతముగ] ఔర్యా! వీడెవఁడో పిడుగువలె నున్నవాఁడు లేదన్న

ఉ. ఒక్కఁడె నాఁటిరా జలధి యొక్కఁడె లంకిని గూల్చె, జంపులే
కొక్కఁడె త్రుంచె రక్కసుల నొక్కఁడె లంక దహించె, శంకలే
కొక్కఁడె పర్చె రావణుని నొక్కఁడె సీతకు నార్తదెల్పె, హెం
పెక్కిన శూరుఁడౌట జయఘోరిని వైచెను రాక్షసాళిలోన్
కావున వీనితోఁ బోరాటము మరకారాటమే ఏదోయొక

మాయపన్ని అవలకు దాటుటయే మంచిది. ఏమనఁ?

చ. గెలచితినేని దైత్యులను గీటడగించిన యట్టి జెట్టియౌ
బలునకు కీర్తిగాఁజూలఁడు వైగొన లెక్కను మాటకంటె నే
గెలువక పోతినేని యొక కీశము కోడె యిదేమి చిత్రమో
బలుఁడు మహాబలుండనె ధరప్రథిఁ హెచ్చగు వేయి రెట్టులున్

అందుచే నొకమాయఁ పన్ని ప్రస్తుత మిచ్చటనుండి తప్పించుకొని తర్వాత వీనిని జయించుటకై యత్నింతును [ప్రకాశముగా] కపీంద్రా! నీకు కలహమే కావలెనా! లేక రాము హితోపదేశమె యవసరమా?

అంజ—అయ్యా! రామహితోపదేశమాలించి చాలా దినములైనది వీనులకు విందుగా నది యెట్టిదో సెలవిచ్చి నన్ను కృతార్థునిగా జేయుఁడు

బల—అట్లైనచో బాగుగా వినుము.

క. రాముని యనుంగు భృత్యుఁడు
భూమిని వాయుజుఁడు గాన పొలుపరంగా
నామహనీయుని మాటకు,
నేమాత్ర మతిక్రమింప నఘుఁడు గాదే!

అంజ—సాక్షాద్విష్ణ్వంశ సంభూతుండగు రాముని మాటను జవదాటు వారెవ్వరు. అటులొనర్చిన పాపము కాదా!

బల—సరే అది ముమ్మాటికి నిశ్చయమేనా?

ఆంజ—ఓహో! కాదనుటకు నాతరమా?

బల—సరే! అట్లైన నచటనుండి కాలు కదల్పకుము. ఇదిగో అది యేమియోతెల్పెద. (అని నిష్క్రమించును)

(తెరలో)

రాముడనగా బలరాముడని యెఱుగవా? వాయుజుండవ భీముడని యెఱుగవా! గదాయుద్ధములో నేర్పటలో నాకాతడు శిష్యుండని యెఱుగవా! మూర్ఖా! నీచదువు చట్టుబండలవా పో. పో!

ఆంజ—ఆ. ఏమీ? బలశబ్దము తొలగించుకొనలేక, నాకో గ్రహింపలేక, పారుపోతు మాటలాడుచుంటివా నిలు నిలు. (అని క్రిందికిదూకును.)

[తెఱవాలును]

---





శ్రీ రస్తు.

శుభమస్తు—అవిఘ్నమస్తు

# గర్వభంగము



అందు

## గరుడగర్వభంగము



ద్వితీయాంకము

### ప్రథమరంగము—శ్రీకృష్ణునిభవనము

(శ్రీకృష్ణుఁడు సత్యభామతో నున్నతాసనముపైఁ బ్రవేశించును)

సత్య—దేవా! తరువాత యేమయినది? బావగారు సుఖముగా యింటికి జేరిరికదా?

శ్రీకృ—చెలీ! చేరినవాఁడు గావున సంతోషముగా నున్నయది,

సత్య—దేవా! కోపించుకొనకుఁడు సత్య చనువుచే నాడుచున్నది.

క. వాఁడు దురు పెద్దబావల,
నాఁడంగులతో సమానమది గాకుండా
యోడినవారలు దురమున
నాడంగులతో సమాన మగుగా పురుషుల్

శ్రీకృ—సఖీ! ఇదియా పరిహాస సమయము. ఆకపివర్యుఁడు మాయన్న చేసినమోసమునకు కుపితుఁడై యున్నవాఁడు. వాని నిటకు రప్పించి కోపము చల్లార్పవలెను.

సత్య—అతఁడిట కెట్లువచ్చును?

శ్రీకృ—గరుడునికై కబురు పంపితిని.

[అంత తెరలో]

శ్రీకృష్ణ పరబ్రహ్మ స్వరూపంబెవఁట?

సత్య—దేవా! మాటలోనే యాతఁడేతెంచినవాఁడు.

(ప్రవేశము గరుడుఁడు)

గరు—దేవా! నమస్కారములు. దేవీ! వందనము.

శ్రీకృ—స్వస్తి. ఓయీ! భక్తశిరోమణీ! నీవలన మాకొక కార్యము కావలసియున్నది.

గరు—దేవా! సెలవొసంగుఁడు.

సత్య—మన గరుత్మంతుని క్రొత్తవానినిగా నెంచి యర్థించుచుంటిరేమి?

శ్రీకృ—ఓయీ! అపూర్వ ప్లవగ మొకఁడు మన ద్వారవతీ ప్రాంతమున విహరించుచున్నయది.

గరు—దేవా! వానినిటకుఁ గొని రావలెనా?

సత్య—మిగుల నాగ్రహముతో నున్న వాని నెటుల తెచ్చెదవు?

గరు—అమ్మా? ఆగ్రహమునకు గతంబేమి?

సత్య—మాబావగారు దానిని కోపి యున్నవారు.

గరు—అందువల్లను రాఁ నియ్యదా? అటుల కాకుండినచో:—

క. ముక్కుల బియ్యప్రు గింజను, పక్కి
కలచుకొనుచు నగసి పాఱెను గతిగా
నెక్కొని యాకపిగాసిసి' ముక్కున
గఱచుకొని తెచ్చి ముంగల నిడుదున్.

శ్రీకృ—నీవంతటి వాఁడవే యగుదువు కానీ—

సత్య—దేవా? సంశయాస్పదమును జూపుచుంటిరేమి?

గరు—అయ్యో! మీఁగయ కలిగించో నది యెంత పని?

క. ఘనమంత మూన కద్రువ, మును సుధ
గొని తెచ్చి యిచ్చి మోదముతోఁన్
జననికి దాస్యము మాన్పితి, నఘా!
యిది యొక్క లెక్క యగునా నాకున్.

సత్య—ఓయీ! ఖగపతీ! నీపల్కు లద్భుతముగానున్నయవి. మహాగజము లేటబడి కొట్టుకొనిపోవుచుండ మశకములు గతియేమి కావలెను' అనుసామెతగా మిగుల బలశాలివని బలశబ్దమే పేరుగా నిడుకొనిన బావగారే కోఁతిగానికి భీతిఁజెంది మందిరము జేరగా నీవు చులుకనగా తీసుకొని వత్తునని నిర్లక్ష్యముగా పల్కుట వింతగానున్నయవి.

గరు—[కోపముతో] ఎంతమాటాడితివమ్మా!

క॥ పలలమును డేగతన్నుకు చులకనగా మింటికెగసి పడితిరుగు గతిన్
ఖలుఁడగు నాకపిగానిని తలంచిన నృటిలోన గాళ్ల దన్నక తెత్తున్.

శ్రీకృ—ఓయీ! నీసత్తా నేనెఱుఁగుదును గాని దానికేమి తెలియును. కాని నీవా కపీంద్రుని యేవంక మీఁద నిటకు బిలుచుకొని వచ్చెదవు.

గరు—ఎద్దియో తామే సెలవొసంగుఁడు.

శ్రీకృ—నీవా వాయుజుని చెంతకేగి "శ్రీకృష్ణ [illegible] రుక్మిణీ సహితుఁడై ద్వారకా నగరంబున నున్నవాఁడు మిమ్ముల నావెంటఁ దోడ్కొని రావలసినదిగా సెలవైనది" అని వచింపుము.

గరు—చిత్తము.

సత్య—[లేచి] [illegible] "చిత్తము శివునిమీఁద భక్తి చెప్పులమీఁద" అనుసామెతగా బైకి బొల్లు బొల్లు

మాటలచే నామీఁదిప్రేమ గలగినట్లు వచించుటయే కాని క్రియ యంతయు భీష్మక రాజనందనిపైనయేగదా మనసు ఉత్పనిగ్రహము వలె యేనెందులకు మీచెంతఁ గూరుచుండవలె.

(కోపము నభినయించి నడచుటకు ప్రారంభించును]

శ్రీకృ—(లేచి] చెలీ! ముందున కొక్కడుగు వైచితివా నాపై యాన. అటునిలుచుండుము. అటులకోపించిన దే నిలువగలనా? [ఆడు గాజని]

తే. గీ. గరిత నీవాఁడి చూపుల గతిని గన్న
మదను తూపుల కంటును పదనుగల్గి
హృదయగోళము నందున మునిత జొచ్చి
తాపమును గూర్చి నుదికి సంతాపమొసఁగె

గరు—(స్వగతమున) ఓహో! యీమెను బతిమాలుటలోనే కాలమంతయు సరిపోవును కాఁబోలు కాక నీమె కెందుకీకోపము.

సత్య—అఁ చాలు ఈబతిమాలుట క్రొత్తలాయేమి!

శ్రీకృ—కోపగించుకొనుట నీకు ప్రాణప్రియము క్రొత్తలాయేమి?

సత్య—ఆ తెలిసినది. మీబండారము. "మాటలు తేటలుమా యింట మాపటిభోజనము మీయింట" యను రీతిగా సత్యయందను రాగము చూపుట వట్టి వ్యర్థపుమాటలతోనే మీర లుపకారసూన్యులు. పనులు సత్యవల్ల నెఱవేఱవలెను. బాళి రుక్మిణీయెడజూపవలెను. సత్యవల్ల గౌరవము సంపాదించవలెనా? నిత్యము వైదర్భిచెలలోబడి యుండవలెనా? ఒక్కటి యోచింపుఁడు!

ఉ. నరకుఁడు లెక్కసేయక రణాంగణమందున మిమ్ము నొంప నా
తరుణమునందు నేతొడరి తాఁకక యుండిన యాయసీక మే
తెఱఁగున మారునో తమరు తిన్నగ యోచనఁ జేసి యున్న నీ
నౌటె వను చిన్నబుచ్చుటకు నెంతయు మీమది యిచ్చగించునే

శ్రీకృ—అవును నిశ్చయమే. కాని యిప్పు డెందుల కీ క్రోధముపకుంగారణము.

సత్య— వెలియనున్న మీసేవకునేయడిగి తెలుసుకొనుండు.

శ్రీకృ—ఓయీ! దీని నేమంటివి?

గరు—(నసుగుచు) అయ్యా! మీరేమంటిరి!

సత్య—ఆ నీవా ప్రభు సేవకుడవు కావా! నీకు మాత్రము నిజమెక్కడినుండి వచ్చును? "రెండు రెండె కొండపప్పు" యను గతిగా మీయిద్దరు సమానులె. నేను వెడలెద. (అని ముందుకు నడుచును.]

శ్రీకృ—చెలీ నీవు కోపించుటకూడా యొకవిథమైన యందమే యేమంటివా?

చ పెడ మొగమిట్టి పెట్టి చెలి వెన్కకు తిర్గి గమించునప్పుడీ
నడక విలాసమున్ హొయలునాట్యము లాడు పిఱుందు లందువా
ల్జడ పెడబంతు లట్టుగ నల్పెడు గంతుల రంతులందమా
యొడుపు కనంగ నాకొకరె యొక్కవిధంబగు వొక్కు నీయెడన్
నేను నీదెస నొనరించిన తప్పునుజెప్పి ప్రసన్ను రాలవగుము.

సత్య—దేవా! గ్రుడ్డికన్ను మూసిననేమి తెఱచిన నేమి?

శ్రీకృ—అటుల నెంచినచో నిన్నింతగా బ్రతిమాలుదునా?

సత్య—(వెనుకకు తిరిగి) ద్వారకానగరంబున నెవరి సమేతముగా నుంటిమని వచించితిరి.

శ్రీకృ—(జ్ఞప్తి నభినయించి) ఓహో! రుక్మిణీ సహితమని వచించినందులకా యీయాగ్రహము.

గరు—దేవా! ఆమాట నిశ్చయమే, ఈమెదగ్గఱ యుండగా నామె ప్రసంశ యెత్తనేల?

శ్రీకృ—ఓయీ! ఖగేంద్రా! కపీంద్రుని వద్దకేగి శ్రీకృష్ణుఁడు ద్వారకా నగరంబున సత్యభామా సహితుఁడై" యున్నవాఁడు. నిన్ను త్వరితముగా రావలసినదిగా నాజ్ఞ యిచ్చిరని చెప్పుము.

గరు—చిత్తమట్లనే. కాని వాఁడా మాట వినక రానిపక్షమున దండనోపాయముగా గొని వచ్చుట కానతియేనా?

సత్య—వేఱేమున్నడుగవలెనా!

గరు—మంచిది సెలవు. (అని నిష్క్రమించును)

శ్రీకృ—సత్యా! నీయాగ్రహ కాలమందొక వైచిత్రియమును గనిపెట్టితిని

నీవు:—

చ. కనుబొమ ముడిచినప్డు శరకాండము వేయఁగఁ జొచ్చె నాపయిన్
మనసిజుఁ డీవు కన్గొనిన మచ్చిక గొల్పిన యప్పుడారకే
ఘుణఘుణ నారికోర్చె కనుసైగ యొనర్చిన యప్పుడందువో
ధనువును పాఱవైచెకద తన్వి! యదేమి విచిత్రమో సుమీ.

సత్య—దేవా! అందు విచిత్రమేమి యున్నది. కోపభావముతోనే నెప్పుడయితే కన్బొమలను విఱిచితినో అప్పుడే మీకులొంగను కదాయను నభిప్రాయముతో మారుఁడు మీపై బాణ వర్షమును గురిపింప జొచ్చెను. ఎప్పుడయితే దృష్టిని ప్రసరింపఁజేసితినో అప్పుడు మీకు ప్రసన్నురాలనైతిను భావముతో అనగా గొంత వఱకు లోనైతినికదా యని నారిని మాత్రమే ప్రయోగింపఁజొచ్చెను. ఎప్పుడైతే కనుసైగ చేసితినో అప్పుడే పూర్తిగా మీకు లొంగిపోతినను భావముతో అనగా నిందు బెట్టుసరి లేదను తలంపుతో ధనువును జాఱవిడిచినవాఁడు అయియుండనెంచు.

క. బెట్టుసరి లేని కలయిక, వట్టి రసాభాసము కనుపట్టును నదియే
బెట్టుసరికలిగియుండిన, ఉట్టిపడిన సరసభావ యుక్తముగుండున్.

శ్రీకృ—అందులకయే కాంబోలు మాటిమాటికి కోపగించు చుందువు.

సత్య—అటులైనకాని మీరు లొంగుబాటునకు రానేరారు.

(అంత తెరలో)

శ్రీకృష్ణుని రాకకై బలరాముఁడు వేచియున్నవాఁడు ఆమహానీయుఁడెక్కడ.

శ్రీకృ—చెలీ! మాఅన్నగారిని దర్శించి యామహానీయుని యాగ్రహమునల్లార్చెద.

సత్య—మంచిది. రండు నేను కూడ మీతోగొంతవఱకు వచ్చెద.

(నిష్క్రమింతురు)

(తెరపడును)

ద్వితీయరంగము

ద్వారకానగర ప్రాంతము—కొండలసమూహము.

ప్రవేశము ఆంజనేయుడు.

ఆంజ—ఇక్కడను రామ బలరామ పరశురాముల దర్శనమైనది. "బల" శబ్దముతొలగించు కొననిమ్ము కొనక పోనిమ్ము కాని యా బలరాముని దర్శనము కేవలము మా రామమూర్తి సాక్షాత్కరించి నట్టు గన్పట్టు చున్నయది ఆ రాముఁడే యీ రాముఁడు కాడు కఁదా? (ఇంచుక తలపంకించి) అబ్బే! అదివట్టిమాట ఆమహానీయుడు త్రేతాయుగము నాటి వాఁడు. ఇయ్యది ద్వాపరము. కాని యింత యుగ భేదమున్నప్పటికి రామ రావణ సంగ్రామము నిన్ననో మొన్ననో జరిగినట్టు ఉన్నది. ఎందువల్ల ననగా:—

సీ. అబ్ధిదాటిన యప్పుడలసిన నెమ్మెయి బ
 డలిక యింకను గడగలేదు
అనిలో దశాస్యుని యణగారు గ్రుద్దిన నే
 యి నొప్పింకను దీయలేదు
సంజీవి కొండకై చనలు త్రోవను జన్న ప
 దముల తీపింక బాయలేదు
అసురులతోఁ బోరు నప్పుడొచ్చిన
 యట్టిగొంతు నొప్పింకను కుదియలేదు.
తే. గీ. రామ రావణు సంగ్రామ క్రమము సెల్ల
 కన్నుగవ కిప్పు డొప్పుగా గట్టినట్లు
 మొన్న మొన మొన్న జరిగిన తెన్నుతోచె
 తలఁప త్రేతాయుగము కథ ద్వాపరమున.

సరిగ యిప్పటికి లెక్క-చూచినచో త్రేతాయుగప్రమాణము పండ్రెండులక్షల తొంబది యారువేల వత్సరములు. ద్వాపర ప్రమాణము ఎనిమిది లక్షల అరువదియారు వత్సరములు ఆయుగములోఁ గొంత గతించిన పిమ్మట రామరావణసంగ్రామము జరిగినది నింక ద్వాపరము కొద్దిగా గడనున్నను యుద్ధము ముగిసి యిప్పటి కిరువైలక్షల వత్సరములై యుండు. ఆహా! యెంత విచిత్రము. మొన్న మొన్న జరిగినట్లున్నది. మా రామచంద్రుని దివ్యావతార మెట్లు మరల కనుగొందును. అన్నమహాశీయుఁడు పునర్దర్శన మిత్తునన్న సమయము సమీపించు చున్నయది. ఓహో!

మ. రామసద్గుణధామ సుందరరామ హృత్కమలాలయం
 బోమహాత్మ నివాసముంగొని యెప్పుగా తరి కోరికల్
 ప్రేమ మీరగ సల్పుచో నిల వెల్పునైన నయోధ్య శ్రీ
 రామ! జానకిరామ! రాఘవరామ గన్పడ కోరెదన్.

(ప్రవేశము గరుడుఁడు కొంతదూరములో)

గరు—(స్వగతమున) ఓహో! వీఁడు చూడగా నొక చిన్ని కోఁతి. వీనిని శ్రీకృష్ణుం కడకు రెండు చెవులను నులిపి మరితీసికొని వెళ్లెదను. ఈ మాత్రముకొఱకై భయమేల? [సమీపించి] జయము జయము కపి రాజా!

అంజ—(తటాలున చూచి) ఓయీ! నీ వెవ్వడవు,

గరు—నే నెవనినిగా గన్పట్టుచుంటిని.

అంజ—ఱెక్కలుగల పక్షివిగా నుంటివి.

గరు—(తలయూచి) ఆ. అలాగునా! నేను ఖగరాజును.

అంజ—ఎందులకై తా మేతెంచిరి.

గరు—నిన్నిట నుండి గొనిపోవుటకు.

అంజ—ఎందు నిమిత్తము.

గరు—ఎందులకా? "శ్రీకృష్ణుఁడు సత్యభామా సహితుఁడై ద్వారక యందున్నవాఁడు. అమ్మహనీయుని యానతి చొప్పున నిన్నిట నుండి గొనిపోయెద.

అంజ—శ్రీకృష్ణుఁ డెవ్వడు. సత్యభామయెవ్వతె?

గరు—ఓరీ మూర్ఖా ఎంతసాహసము వచ్చినది నీకని? యింతమాట యిదివరకన్నవారు ముందనబోవు వారలుకూడా యుండరు. నీవొక్కడవే యిప్పటికి కనుపించితివి. ఊ జాగ్రత!

ఉ అరయఁగ కృష్ణుఁ డెవ్వఁడు మహాసతి సత్యయెవర్తె యంచు నో
శ్శరుగక ప్రేలెదవు జగదీశునె యాజగదంబనే ఖలా
తిరుగ జవాబు చెప్పకరుదెంచినచో సరెకాని వారి యు
త్తరువును మీఱితేని బలిదంబుగ నెత్తుకపోదు నిప్పుడే.

ఆంజ—(స్వగతమున) వీడెవడో నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నవాఁడు వీనికి గూడ గర్వభంగము గావలె. కాని యింకా నమ్రత చూపెద. (ప్రకాశముగా) పక్షిరాజా! అంతతొందరయేల? కొంచము పశమింపుము.

గరు—(స్వగతము) మనమెంత బింకముగా మాటాడిన వీఁడంత లొంగుబాటునకు వచ్చువాఁడు. కావున యింకా నాప్రతాపము చూపి వీనిని డంగుపుచ్చి భయభ్రాంతునిగా నొనర్చిన శునకమువలె నావెనువెంట రాగలఁడు. (ప్రకాశముగా) ఓయీ! వలీముఖా! నీనిమత్తము వచ్చినవారెవరో నీకై పంపినవారెవరో యెఱుంగుదువా?

చ. గరుడుఁడు పన్నగాశనుఁడు కైటభశత్రుని వాహనుండు వి
ష్కిర సముదాయ మంతకును స్వామియతండరుదెంచె పంపువాఁ
డరయఁగ ఆదివిష్ణు వసురాంతకుఁడాద్యుఁడటంచెఱుంగు మిం
కెరిగరుదెంచకున్న పయినేమగు నీకనియెంచు మామదిన్.

ఆంజ—(స్వగతమున) వీఁడు నన్నొక అలసునిగా నెంచి విరసముగా వచింపఁ జొచ్చినవాఁడు. ఇంకా కొంతవఱకు వీని ప్రతాపము జూడనిమ్ము (ప్రకాశముగా) మహాత్మా! పక్షిరాజువని యెఱుంగక మన్నించుట మానితిని. అందులకై నాపై నలుక చెందక మీప్రభువగు శ్రీకృష్ణుఁడాదినారాయణమూర్తి యొనర్చిన కృత్యము లేకరుపెట్టుము.

గరు—ఊఁ. ఆలాగున దారికిరమ్ము. ఆహనీయుని చర్యలువినుము

సీ. చనుబాలు త్రాగుట సరియెఱుంగనినాడె
పూతనయను దాని పొగరుమాన్చె
నేలపై ప్రాకుట నేర్చి నేర్వనినాఁడె
ధరపైన వడ్డల నొరగఁజేసె

చిట్టి చిట్టడుగులు పెట్టనేరనినాఁడె
అలతృణావర్తుని బిలుకుమార్చె
మద్దిపల్కులగతి సుద్దులుంగనినాఁడె
ఖలు శకటాసురు నిలనుగూల్చె
తే. గీ. భళిర! గర్భాష్టమము పాసి పాయకమునె
కంస చాణూర ముష్టిక ఘనుల ద్రుంచె
కృష్ణుఁడనఁగ నెవ్వానిగ నెంచినావొ
అనఘుఁ డవ్యయుఁ డచ్యుతుఁ డభవుఁడెన్న.

అంజ—(తెలియనివాని వలె) ఆ అటులనా? అయితే గొప్పవాఁడే

గరు—ఓయీ! యిందులకే యద్భుత పడుచుంటివా? ఓకపీశుఁడా! ఓకోనమస్కీ! "ఎద్దుఁకేమి తెలియుఁ నటుకులరుచి" యను సామెతగా నీకా మహనీయుని, యాపరమ పూరుషుని, యాపరాత్పరుని, యాపరంధాముని పరిభావమేమియెఱుంగుదువు.

సీ. అమర నాయకుఁడల్గి అతివృష్టి కురిపింప
గోవర్ధనము గోట గొన్నవాఁడు
కమలాసనుఁడు కినుక కార్చిచ్చు పనుపంగ
విడియంబుగతి పుక్కపెట్టినాడు
పృశ్నిఘటనకు తల్లి యెగ్గాడ భువనముల్
పదునాల్గు నోటఁగన్పఱచినాడు
యమునితోఁ బోరాడి సమసిన సహజుల
తెచ్చి తల్లివ్యథను దీర్చినాడు
తే. గీ. అబ్ధిరాజుచే మెప్పొంది యవని బడసి
మించి ద్వారకాపురిని నిర్మించినాడు
కృష్ణుఁడనఁగ నెవ్వానిగా నెంచితీవు
అపరిమేయుఁ డమేయుఁ డవ్యయుఁడు సుమ్ము.

ఆంజ—(తలపంకించి) అయిన నవ వచ్చునేమో!

గరు—ఓమూర్ఖుఁడా! నీక్రోతి చేష్టలు పోనిచ్చుకొనవు.

ఉ. భూతిగ జీవకోటికిని ప్రాణము నిల్పెడు వాయువందు సం
భూతుఁడవైన కావగును బుద్ధియు సుద్ధియు నెట్లు వచ్చు పో
క్రోఁతివి, కోవ త్రిమ్మరివి, కొమ్మ మెకంబవు దిట్టనౌను నా
ధాతను నిన్ను గట్టి మరుతాత్మజుగా సృజియించి నందుకున్.

ఆంజ—[స్వగతమున] ఓహో! వీఁడు మనలోకువ బాగుగా నెంచి నాడు. కానిమ్ము వీనికింతకింత చేసితీరెద. (ప్రకాశముగ) ఖగ రాజా! కోపింపకుము. అందఱు తెలిసినవా రుందురా.

గరు— (స్వగతమున) చాలామట్టుకు పీని పెంకితనమణిగినది. మనధాకాకు లొంగినవాఁడె. ఇఁక శ్రీకృష్ణుని వద్దకు మూఁడు నిముసం బులలోనొనిపోనగును. ఇంకావీడెంతో బలవంతుఁడను కొంటిని భయ ములేదు. [ప్రకాశముగా] ఓయీ! ఆతఁడసు రాంతకుఁడు.

సీ. అలఘుదైత్యులకెల్ల బలుఁడంచు నుతిగన్న
వృషభాసురుని వ్రేటు వ్రేసినాడు
మానిసి దిండ్లలో మాయావియైన ప్ర
లంబాసురుని వ్రేటు లాడి నాడు
మూఁడు చెర్వుల నీరు ముక్కోటి సురలఁదాం
ఇంచిన ధేనుకు ద్రుంచినాడు
బ్రహ్మ విష్ణులఁగూడ పైకొని ధీకొన్న
కేశవ్యో మునినుగ్గు చేసినాడు
తే. గీ. కాల యవన జరాసంధ గర్వరేఖ
లెంద రెందరినో మడియించి నాడు
కృష్ణ బలరాములవతార జిష్ణులంచు
నాది పరమాత్మలో సంశ యంచునెంచు.

ఆంజ—ఆ ఏమిటీ! శ్రీకృష్ణుఁడవఁగా నెవ్వఁడో మహానుభావుండు నుకొంటిని. ఓరీ! మూర్ఖా ఇదివఱకు ఘడియకిందట నన్నుగని వెఱగొంది పిరికి పందవలె పాఱిపోయిన బలరాముని తమ్ముఁడా! "బల" శబ్దమును తొలఁగించుకొనలేక తలవంచుకొనిన బలరాముని ప్రియానుజుఁడా మూర్ఖా! సమరమునకు మగవాఁడవనుచు బయలు వెడలి విముఖుడై వెన్నిచ్చినవాని సోదరుఁడా? అట్టి వాని సేవకుఁడవు నీవు మాత్రమాతరగతిలో, జేరవా! ఓరీ వాచాటా! హాహా.

మ. బల శబ్దంబును దీయలేక జెయిగల్పన్ లేక నాతోడఁ గ
ల్లలు వ్రాక్కుచ్చి రచించి మోసములు పాటాడెంగఁదా వాని నే
పలుకన్నీకేటు నోరువచ్చును పర బ్రహ్మాంశుజుండంచు నో
పలువా! యీపయిఁ బల్కితే నటుల నిస్సంజ్ఞాషగాఁ దన్నెదన్.

బహుజాగ్రతగా మాటాడు. ఇదిగో [అని కాలెత్తి చూపుచు]

మూర్ఖ

ఉ. మర్దన మెంతబాగుగ సమర్థతతో నొనరింప నౌషధం
బర్థమెయై గుణంబెసఁగు నట్టుల నూరక పిన్న పెద్దనే
యర్థ మెఱుఁగలేక రహివ్యర్థము లాడెడు వాని గట్టిగా
మర్దన చేసినేని గుణదుర్దనమై గుణవంతుఁ డౌను గా.

కావున యీసారి నోరెత్తిన మెత్తగ మర్థించి మరిపంపించెద. జాగ్రిత జాగ్రీత.

గరు—[కోపముతో] ఓరి కోఁతిగా నామో కాలంత లేవు. బాలకులాటలో కాలి బంతినితన్నినరీతి గాదన్నిన చో గ్రోసులోఁబడఁగలవు. చూడుమి దేనాపరాక్రమము. హహాం.

శా. కాలన్మాంసము గ్రద్దతన్నుకొని యాకాశంబుపై కొప్పగా
పీలన్గప్పకు బోవుభంగి తఃలువా వీలన్ నినున్ సుల్వగా

గాలం దన్నుకఁబోయి కృష్ణుపద యుగ్మంబందునన్వైతునా
తాలంకుండును మెచ్చ మేలనుచు నాదైత్యారి కొండాడగాన్

[అని మీఁద కలియంబడును]

ఆంజ—[ఆకసమెత్తుపెఱిగి] ఓరీ! దుర్మదాంధ!

ఉ. ముక్కునుబట్టి యిట్టునటు ముందుకు వెన్కకు గుంజి పిమ్మటన్
బుక్కలువాయఁగొట్టి మెడపుచ్చుకు నావలకున్ గిరాటువేయ ని
న్నిక్కడ నుండి ద్వారవతి నీప్రభుచెంత పడేటటుల్ ఖలా
దిక్కను కల్గియుండిన నధీశ్వరులొద్దకు బోయి నేడ్వనా.

(అని గరుడుని ముక్కుపట్టుకొని గుంజి రెండు లెంపలు వాయిం
చి) తులువా! అయినదా గర్వభంగము.

గరు—గజగజవణకుచు స్వగతమున అమ్మ! వీఁడెవఁడు రా? ఆక
సమంతపొడు గెదిగినవాఁడు వీనింజూడ భయమగుచున్నయది. (ప్రకా
శముగా) మహాప్రభో! అపరాధము. అపరాధము. శమింపుఁడు
శమింపుఁడు.

ఆంజ—అపరాధము సల్పితినని పాదాక్రాంతుఁడవుకమ్ము.

గరు—చిత్తము అట్లనే (అనిపాదములపైవ్రాలును)

అంజ—ఊ. సరే లెమ్ము. (అని లేవదీసి) సరే జాగ్రత జాగ్రత

క. అపరాధిని క్షమియింపుము,
నపరాధ మొనర్చితంచు నాడెడువానిన్
గృపతోడ, గావుమని మాన్యపతి రఘూ
ద్వహుని యాన నిన్విడిచితిగా

అందువలన బ్రతికితివి పో పొమ్ము [అని నెట్టివేయును.)

గరు—[తూలి నిలిచి స్వగతమున] బ్రతికితిని యీపూటతో
నాయంతటి బలవంతులు లేరనే గర్వముడంగినది. (ప్రకాశముగ) దేవా!
సెలవొసంగుఁడు.

ఆంజ—మంచిది పద రెండడుగులు నేనుకూడా వచ్చెదను.

[అని యిరువురు నిష్క్రమింతురు.]

[అవనిక జారును]

---

## తృతీయరంగము



[ద్వారకా నగరము—సత్యభామ యొక్క కేళీమందిరము]

[ఒకసోఫాకుర్చి పైఁజారిగిలికూరుచుండ దగ్గరగా సత్యకూర్చొనియుండును)

శ్రీకృ—సత్యా! యింత యాగ్రహ మెందులకు? దినమునకు జాము లెనిమిదియైనప్పటికి పండ్రెండు జాములు నీయింటనే యుండుటమూ మూలైయుండగా:—

ఉ. పాత్రతెలుంగకీవు ననుపల్మరు దూషణ చేయుచుంటివో
సాత్రజితీ! నిను న్విడచి జాంబవతీపతి మిత్రవింద నా
మిత్రతనూజ నాగ్నజితి మెల్తుక రుక్మిణి భద్రలక్షణా
క్షేత్రల నెవ్వరింట కడుసేపు వసించుచు నుంటి చెప్పుమా.

సత్య—మాటల కేమికొదువ? పిన్ననాఁడు మీయమ్మ ఉగ్గుపాలతోఁగలపిపోసినప్పుడు ఎన్నిసారులు భీష్మక రాజపుత్రిని గారవించి నన్ను న్యూనతపఱచి యుంటిరి పైకిమాత్రము సత్యయందనురాగవర్తనులై యున్నట్లు వర్తింతురు. అబ్బో:—

ఉ. మాటలు తీపి యిక్కడను మాఱసి మక్కువ యక్క,డూరకే
నేటుగ నిల్చుచిచ్చుటను నిక్కముగా మదియాడ. వట్టి స
య్యాటలు నాయెడందు మరునాటలు నామెతో నర్చిపై గనన్
వాటముగాను చెప్పుటలు పల్మరు నేర్చితిరేమి చెప్పుదున్

ఏదియో నేర్చవలెనన్న ముందుగాబొంకు నేర్చవలె ననుసామెత మీావల్ల నేర్పట్టబడినది.

శ్రీకృ—చెలీ! నిశ్చయమే ఇదియంతయు నీయొక్క స్నేహప్రభావమే.

ఉ. మాయని శాస్త్రయుద్ధము, పయస్విని గా నొనరించి తీవె, యే
తీరున నెట్లు బొంకునెడ చిన్నగ నుండుట నేర్పితీవె, యే
పారున మాటలాడునెడ చక్కన పాడుట నేర్పితివెంట
సారసనేత్రి! ఒజ్జవయి సల్పితి విట్టి ప్రభావ పండితిన్

సత్య—నాపాతము నాకేవ్యాపించు చుంటిరా?

శ్రీకృ—అందరి సాదృశ మెఱుంగని తక్కువారలను గ్రహించిన నేమిలాభము?

సత్య—ఏమీా? ఎప్పుడు మీా కన్నులు నాపైనే యుంటవి కాబోలు తక్కువారలను ప్రశంసింప రేమి?

శ్రీకృ—తక్కువారలు టక్కులలోను టెక్కులలోను నీకంటె తక్కువవారలే.

సత్య—అవును నిశ్చయమే.

సీ. భీష్మక సుతవట్టి జేలబెంబేలగు,
కాళింది తెలియని గోలగోల
భల్లుకాత్మజ మహా యిల్లాలు వెల్లుల్లి,
నాగ్న జిత్తెన్నగా నంగనాచి
మిత్రవిం దెఱుగదు పాత్రిత పాత్రిత
లక్షణ కేరిపై కక్ష లేదు
రాధ పాపము సద్ద సాముహసావను
భద్ర నెంచగ మొద్దు భద్రమరయ

తే గీ, సత్య యొక్కతె యిందరి చానలందు
మిగుల నెఱజాణ జగజాణ తెగువ కాంత
యనెడి యక్షతలు మమహార్ధాంగమందు
వైన నాజన్మ నక్షత్రి ఫలము నుండు

శ్రీకృ—సఖీ యింతమందిసుందరాంగులలో నీపేరు ముందునకు వచ్చుటమాత్రము పైపైనున్నదా?

సత్య—ఆ. చాలు చాలు.

(అంత తెఱలో)

శ్రీకృష్ణమూర్తియొచ్చట నున్నవాఁడు (కొంచమూరకుండి)సత్యభామా సమేతముగా నచ్చటకూర్చొనియున్న వారనియా వచించుచుంటిరి.

శ్రీకృ—చెలీ! గరుడుని కంఠ స్వరముగా నున్నయది.

సత్య—అయినచో వాయుజుఁడు కూడా వచ్చిన వాఁడె

(ప్రవేశము గరుడుఁడు)

గరు—(పణాకుచు) దేవా! దేవీ! నమస్కారము

శ్రీకృ—స్వస్తి. పక్షిరాజా!

ఉ కన్నులనుండి హర్ష పులకాంకిత బాష్ప ప్రవాహ ధారచేఁ
బన్నదనంబుతోఁ దనరు వక్త్రము నేడిటు మారియేలకో
కన్నుల నుండి దుఃఖ భయాంకంపిత బాష్ప ప్రవాహ ధారచే
ఖిన్న దనంబుతోఁదనరె ఓడుకవక్త్రమిదేమి చెప్పుమా.

సత్య—ఓయీ! ఇదివరలో వచించిన ప్రగల్భము లేమయినవి?

గరు—దేవా! యేమని వచింపను?

మ అసలే కోఁతికిఁదా యతఁడు పయి నెలాంకుండు కావించె చె
క్క సకంబందుల కక్కసంబు పడితా కాదంబరింద్రావి న

క్లైసగెన్మే నెఱుంగగ కుండె నటమీఁదే నాడనాఁపల్కులన్
వ్యసనంబయ్యెను తేలు పొడ్చి నటులా పాపాత్ముఁడొప్పారెగా

సత్య—సరే. బాగుగానున్నది. అసలే క్రోఁతి. అది కల్లుత్రాగినది. దానిపై దేలుకుట్టినదట ఇఁక దాని వికృతి చేతలకు లోటేమిటి యనుసామెత సార్థకము లోనికి తెచ్చినదాయెను?

శ్రీకృ—ఓయీ! నీవు ముందాతనితో నేమని ప్రస్తావించితివి?

గరు—మీయానతియే నాతనితో వచించితిని. అందుపై తోఁకత్రొక్కిన త్రాచువలె లేచి కృష్ణుఁడెవఁడు సత్యయెవత యని దుర్భాషలాడుచు నేను రానని ఖచితముగా బల్కినవాఁడు.

సత్య—స్వామి సేవకుఁడవైయుండి స్వామినితిరస్కరించినందుల కూరకుంటివా?

గరు—అందుపై నేను కోపించి పైఁబడగా నాతఁడు మంటికి మింటికినొక్కటిగా నెదిగి.

చ. ఎడమ కరంబు నాపఁగొని యేమని బల్కెను క్రింది మీఁదికిన్
వడి వడి గుంజి తక్కకయి బాగుగ సాఁచి తగిల్చె లెంపపై
దడ దడ పండ్లు రాలుగతి దాళువ పెల్లడు భంగిపైగ నే
ల్పడునటు త్రోసె దిక్కుగల పట్టున చెప్పుక పొమ్మటంచునన్.

సత్య—ఆహా! బలవంతుఁడవగు నిన్నే యాక్రోఁతి గాఁడింత పని చేసినా?

శ్రీకృ—ఓయీ! జరిగినది యేమో జరిగినది. అది "గత జల సేతు బంధనము. అందులకై కుందవలదు. మరల నీవాతని చెంతకేగి" అయోధ్యాపురమున శ్రీరాముఁడు సీతాసమేతుఁడై భరత లక్ష్మణ శత్రుఘ్నులిరు పార్శ్వములందును కొలువ విభీషణ సుగ్రీవాదులు కైవారములు సలుప సప్త మహాఋషులు స్తవమొనర్ప నిండు కొల్వున్నవాఁడు. నిన్ను దర్శనార్థమై రావలసినదిగా నానతి యొసఁగిరని

వచింపుము. ఆతఁ డిదివరలో నిన్నెంతగా పరాభవ వించెనో యిప్పు డంతకంటె వేయింతల సంతోషముతో నిన్ను కౌఁగలించుకొని గౌర వించును

గద—[గుండెలు బాదుకొని] మహాత్మా! యిఁక నన్ను బ్రతు కనీయరా?

చ. సతతము ద్వారకాపురిని సాత్రాజితీ సహితుండవైన న
చ్యుత యిముగూర్చి మీపనుప చొప్పున నిక్కము పల్కినంతనే
ప్రతిఘ మనస్కుఁడై దవుఁడ పల్లగు వేటటు చావఁగొట్టెగా
గతమయినట్టి త్రేతయుగ కార్యము గూర్చి వచింప నమ్మ నే.

ఇదివరలో నూడెడు గతిగా కొట్టిన దంతము లిప్పుడూడి భూమిపై రాలునట్టుగా జావఁగొట్టుట నిశ్చయము కావున భక్త వాత్సల్యమును జూపి యీ కార్యభారము నాపైనుండి తొలగింప బ్రార్థించెదను. ఆసంగతి యటుండ నిండు.

ఉ. ఆతత భక్తితో మిగుల నాతురతన్ వెనువెంట నంటి న
న్నాతఁడు రాఘవుండగల పట్టున జూపు మటన్న జూపుచో.
రీతిగ గల్గు రాముని వలీముఖనాథు విభీషణాదులన్
త్రేతపు వర్తనంబరుగుదెంచుట యెట్టులు ద్వారకంబునన్.

దేవా! అటుల జూపకున్న నన్ను బ్రతకనిచ్చునా? నేలను బెట్టి కాలను రాయఁడా? స్వామీ! యిఁక నన్ను బ్రతుకనిచ్చెదు తలంపు మీకు లేదు కాఁబోలు.

సత్య—ఓయీ! ఆతఁడు రాఘవేంద్రుని చూపుమని వెన్నంటిన తిన్నగా మాయింటికే కొని తెమ్ము. ఆపైన నీమహానీయుఁ డున్నాఁడు. నీవు చల్లగా జారనగును

శ్రీకృ—ఓయీ! భయముజెందక యీసారి కూడా యత్నింపుము నీప్రాణమునకు నాప్రాణమడ్డు వేయుదునని నమ్ముము నిజముగా నీకాపాటము వచ్చిన నన్నుతలంచుము

గరు—చిత్తము ఇదేసెలవు (అని నిష్క్రమించును)

సత్య—దేవా! నిశ్చయముగా నాకపివరుండిట కేతెంచిన రాముడేడి? సీతయేదీ?

శ్రీకృ—ఓసీ! ఇదియా నీయోచన. ఏనే రాముడను.

సత్య—అయినచో సీతను నేనే.

శ్రీకృ—నీవు భూమిజ వేషమును దాల్పఁజాలవు.

సత్య—నాకంటె సమర్థు లెవరు?

శ్రీకృ—విదర్భ రాజ తనయ.

సత్య—(లేచి కోపముతో) జాలు జాలు. నిశ్చయమే నేను ధరణీ జాతనుగా నెట్లు మారుదును? అంత చాక చక్యమేది?

సీ. అతిబాల్యమున నాటలాడెడు హదనున
కరమున హరువిల్లు పెఱుక లేదు
జనకుని యాజ్ఞమై వనవాసముఁ గేగు
ప్రియునాథు వెన్నంటి వెడల లేదు
ఆపదన్నకునబ్బి పో పొమ్మటంచును
కరమొప్ప మఱఁదినెగ్గాడ లేదు
ఆకస్మికముగా నపహరించుకు బోవ
దనుజ నాథుని యింట వనర లేదు

తే. గీ. ఎంచ బలమేది? తెగువేది యీరసేది?
శక్తికి తరమేది? భూమిజ తెఱఁగు దేవ!
అలఘు సత్రాజితి కొక సాహసము తక్క
లేదు వెనుకంజయనునది లేదు మాకు.

అందుల కుదాహరణము. కావలయునంటిరా! నరకాసురుని
కాలములో గేలిసేయుటయే?

శ్రీకృ—ఓసీ! ఒక తుక్కు రక్కసిని యుక్కడించి నందులకే
యింతగా నెక్కిపడు చుంటివే. ఆభూజాత బలమును వినుము.

చ. అరయగ లోక కంటకుఁడై యెట్టి యాదశకంఠు పౌత్రుఁడై
వరలి గుణంబులన్నిటను బ్రబ్బి పితామహులకంటె, కల్గి ము
ష్కరత త్రిలోక కంటకుఁడుగా జరియించు సహస్ర కంఠునిన్
దురమున శంకగా వలిపి త్రుంచె ధరిత్రిజ, మెచ్చగా సురల్.

ఆసంగతి యెఱుంగుదువో లేదో. ఆగ్రంథమునకే "సహస్ర
కంఠ రామాయణము లేక సీతా విజయ మని" నామాంతరము కలదు.
అదియేకాని నీవలె:—

చ. వనితరో పారిజాత ప్రసవంబునకై ధవు మూర్ధ మందునన్
గనరుగ సాచి పుచ్చెడమకాలున దన్నిన రీతి భర్తనిన్
బనిగొని తన్నలేదు బహుబాధ లగాధము నందు ముగ్గినన్
గినక నెఱుంగ దాకతన కీర్తి వహించెను సీత ప్రీతమై

సత్య—(ఎగతాళిగా) దేవా! అంతటితో మీయుపన్యాస
ధోరణి కట్టిపెట్టుఁడు ఇంక నాయుపన్యాసము వినుండు. పెద్దవారలు
చెడ్డవారలు గారు.

ఉ. తక్కపగ నిట్టిపాదమున తన్నిన యంతనె పారిజాత మ
మ్మక్కరో! తెచ్చె కృష్ణుఁడు మహా మహు శూరుఁడు స్వర్గ నాథునే
నుక్కడిగించె నన్న యశో మెప్పగ దక్కెను మీకు దక్కె స
త్యక్కట యంత గర్వియనెఁ డాయశకీర్తియె నాకు దేవరా!

అందువల్లనే "పారిజాతాపహరణ" మను గ్రంథ మొకటి
ప్రచురణ మైనది. మీపేరు ప్రతిష్ఠ దానివలననే మరింత హెచ్చయినది.

అప్పఁగా నావలనమీాపేరుబయిటకువచ్చినది. అలాగుననే భూమిజ వలన రామాయణమను గ్రంథము వెలువడినది. రామునకు కీర్తివచ్చినది. ఎట్లంటిరా? జానకి;—

ఉ. పాయక భర్తతో వెడలఁబొఱకయుండిన మాయ లేడి నా
ప్యాయత గోరకున్న మరదచ్చుటనుండిరియె పోకయున్నదై
తేయ విభుండు సీతనెటు స్తేయము సేయును జేయకున్న రా
మాయణ గ్రంథమేది? రఘునందుని పేరుప్రతిష్ఠ లేవొకో.

కావున మేమిద్దరము సమానులము. ఆ కారణమున జానకీవేష మునకు నేను తగుదును గాని తక్కిన యింతు లెంతమాత్రముతగరు. ఆ యెప్పటికితగరు.

శ్రీకృ—ఏవేషము భూమిజ తెలుగుగా నొప్ప కున్న?

సత్య—ఇంకమీమ్మల నెప్పు డేవిధమైన కోరిక కోరనేకోరను. ఇఁక నేవిషయమునకు ముందంజ వేయను. తగుదునని ప్రతి సంగతికి ప్రయత్నపడను. వేయేల? ఏనే భూమిజ వేషము నొప్పించ లేక యుండిన నియ్యదియే కథగాఁగొని "సత్యాగర్వభంగ మను" నాటక మొకదానిని ప్రచురింపఁజేయుఁడు.

శ్రీకృ—మంచిది. ఇదియే జ్ఞాపకముంచుకొమ్మ. పద జానకీ వేషమునకు యత్నించుటకు.

సత్య—మంచిది.

(నిష్క్రమింతురు)

(తెరవాలును.)

———

## చతుర్థరంగము.

(ద్వారకాపురముయొక్క బయలు.)

(ప్రవేశము ఆంజనేయులు ముకుళిత హస్తుఁడై చిన్నరూపముతో)

మత్త. రామ! రూపమునందు సుందర రామ నామమె యొప్పఁగా
రామ! దేహము కాంతి సుందర రామ చామన చాయగా
రామ! భూమిజ భర్త సుందర రామ సద్గుణధామ! ఓ
రామ! దర్శన మిమ్ము సుందర రామ యాఖ్యని వేలుపా!
రామా! రాఘవ రామా! దశరథరామా!

### దండకము.

శ్రీరామ రామా! వికర్తాన్వయాంబోధి సోమా! దయాపూర్ణ ధామా!ఖలవ్రాతకర్ణ దండ యామా! అయోధ్యాపురీ సార్వభౌమా మనంబందునీనామమే ధ్యానముఁ జల్పుచున్నట్టి యీయంజనీపుత్రు నైఁ జూపవే పేర్మి పట్టాభిషేకంబు నందిచ్చి యున్నట్టి యాపద్వరంబిప్పు డీద్వారకాపురంబందునం బార్వ సౌమిత్రి శత్రుఘ్నులు సీవనలింజామరల్ ఛత్రముల్ బట్టకై కేయసూనుండు కైహారముల్సల్ప సుగ్రీవుఁడా దైత్యనాథుండుభల్లూకనేతన్ బలేస్తవాచయ్యముల్ వేద మంత్రంబులన్ బాఠముల్సేయ సీతా మహాలక్ష్మితోఁగూడి సాకేత పట్నంబు నందుండఁగా దర్శనంబీయఁగా గోరెదన్ దేవ! భక్తాళినింబ్రోవ నీవే కఁదా దిక్కు స్వామి! నమస్తే! నమస్తేనమః.

అహా! యెట్టిఁగవాఁడైనను సరేయిప్పట్టునయేగుదెంచి మారా ముని వృత్తాంతను చెప్పిన వానిని శిరంబు చెక్కలు మూఁకాని భుజముపై నిడుకొన కుందునా?

(ప్రవేశము గరుడుఁడు)

గరు—[స్వగతమున] బ్రతికితిని. ఇంక భయము లేదు. ఇప్పుడే కఁదా రామచంద్రుని వార్త చెప్పిన వానిని మూర్ధంబున బెట్టుకుందునని వచించినవాడు (ప్రకాశముగా) కపివర్యా! గరుడుఁడిదే నమస్కరించు చున్నవాఁడు

అంజ—మరలేల వచ్చితివి?

గరు—(వణకుచు) శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవితో భరత లక్ష్మణ శత్రుఘ్న సహితుఁడై సుగ్రీవజాంబవంత విభీషణాదులు కొలువ సప్తమహాఋషులు వేదములు పఠింప నయోధ్యాపురమున నున్నవాఁడు మిమ్ములనుగొని రావలసినదని యానతియొసంగుటచే వచ్చితిని.

అంజ—(సంతోషముతో) ఏమిటి తండ్రీ! ఏదీ నాయనా? మజ్జనకుఁడు రామచంద్రుఁడే, మాజనని ధరణిజయే? మాయేలిక అర్కనందనుఁడే, మహాత్వయేమి నాయదృష్టము నిశ్చయమేనా?

గరు—అనృత మేమైన గరల బ్రతుకెక్కడిది.

అంజ— ఆ సరే! యిట్టిసంతోషవార్త చెప్పినందులకు శిరంబు మూర్కొని చెక్కులు ముద్దుగొని కౌఁగిటను దీసికొందును రమ్ము.

గరు—(స్వగతమున) కౌగిటబట్టి నులిమి వేయఁడుకఁదా? [ప్రకాశముగా] అయ్యా! భయమగుచున్నది;

అంజ—భయము వలదు

క. ఈవును నేనును దేవుని సేవకులముగాన నందు చెలికాండ్రమె గా
గావున మద్దిడు చెక్కుల భావింపుము విందుకింద ఖగాధిపతీ
[అని చెక్కులు ముద్దుగొని] నాయనా! ఖగపతి!

తే.గీ. మధురిపువు తనజగమునే మహలు మధ్య
దీప్తికయి వ్రేల్చు విద్యుతు దీపమనఁగ

మించి కనువారి కనులు మిర్మిట్లుల గొలుప
దివము నడుమను వెలిగొందు దినమణిగను

ఇప్పుడు సరిగా రెండు యామములైనవి. నేను మధ్యాహ్న సంధ్యావందన ముత్తరసముద్ర తీరమునకేగి నిర్వర్తించుకొని యొకయామములో నరుదెంచెద నీలోగానారాక మజ్జననీజనకులగు సీతారాములకు శ్రుత పర్చుము.

గరు— మంచిది. (స్వగతము) బ్రతికితిని. [ప్రకాశముగా] సెలవు

[అని నిష్క్రమించును]

ఆంజ— ఇక జాగొందులకుడ త్తరమహాసముద్రమునకు వెడలెద

(అని రివ్వున మింటికెగయును)

[తెఱవాలును)

---



శ్రీరస్తు.

శుభమస్తు.—అవిఘ్నమస్తు.

# గర్వభంగము

అందు

## సత్యాగర్వభంగము.

### తృతీయాంకము.

ద్వారకాపురము—రుక్మిణి అంతఃపురము.

(శ్రీకృష్ణుఁడు రుక్మిణి సహితుఁడై యున్నతాసనంబున ప్రవేశించును)

శ్రీకృ—చెలీ! భీష్మకరాజనందని! గరుత్మంతుఁడేమి వచించి వేడలెనో యెఱుఁగుదువుకఁదా? ఆసంగతిని గూర్చి యత్నింపక నూరకుండుట మన మాపావని యందు విశ్వాసమును జూపినవారము కామా? ఏమంటివా

చ. అతివ్యధనొంద త్రేతను దశాననునింటను నబ్ధిదాటి ని
న్నతకి మదీయ క్షేమము సవిస్తరమున్ దెలియంగఁజెప్పి ఓ
యతివ త్వదీయ భద్రి మెఱుఁగంగను నాకడబల్కి యుర్వరా
సతత సుఖాబ్ధిఁదేలునటు సల్పిన వాని నెఱుంగవో చెలీ

రుక్మి—దేవా! ఏమిటుల సెలవిచ్చుచుంటిరి? యుగ భేదము జన్మభేదము కలిగినంతమాత్రమునమఱచితి ననుకొంటిరా? పూర్వజ్ఞానము లేదనుకొంటిరా ఆగతము తెలియదనుకొంటిరా?

శ్రీకృ— అటులైనచో వానింగూర్చి కొంత శ్రుత పరుచుము

రుక్మి—(నవ్వి) అటులైన దేవా వినుండు.

ఉ. వాయుజుఁడంజనీ సుతుఁడు పావని భక్తుఁడు కామ రూపి రా
మాయణ గ్రంథ పాత్రమున మానుగ ముఖ్యుడు రాజ్యభారముం
హాయిగ బూను వేళ మనలాంతఁడు దర్శన మింక నొక్క ప
ర్యాయము గోర ద్వారమునందున నిత్తుఁటంచు నాడమే.

శ్రీకృ—చెలీ! ఆగుము మనము సాకేత పురంబున రాజ్యాభిషేక కాలంబున నేతీరుగా నుంటిమో? నేఁడాతనికి దర్శన మిచ్చు కాలంబునకూడాయటులనే యుండవలెను కఁదా? అప్పటి వారిప్పుడెట్లు వత్తురు.

రుక్మి—దేవరకుఁదెలియని సంగతి కలదా? నానోటవినవలెనని తమకుతాత్పర్యము కాఁబోలు వినవినండి.

సీ రాముఁడేయగు మును లక్ష్మణుండవగ సా
త్యకియగు భరత శత్రుఘ్న యుగము
అక్రూరుఁడౌ కఁదా యర్క తనూజుండు
కృతవర్మయే పులస్త్య సుతుడుసుండు
కన జాంబవతితండ్రి మునుజాంబవంతుండె
సవతాలు లేద్గురు సప్తఋషులు
ఈద్వారవతియె గానెన్న యోధ్యాపురి
వసుధ యాదవతతిప్లవగగణము
తే గీ. ఎంచ శ్రీరామ విభుఁడె శ్రీకృష్ణ విభుఁడు
మిగుల సుచరిత్రి సీత రుక్మిణియె సుమ్మ
గాన లోటేమి కల్గింపగాను నేడు
నాఁడు పట్టాభిషేకము నాటివనము.

కావున మీరలు త్వరపడుడు కపిరాజు సంధ్యానుష్ఠానములు జరిగించుకొని యేతెంచునని కఁదా ఖగరాజు వచించియున్నవాఁడు

శ్రీకృ—సత్యకాక గర్వమేడ్పించు చున్నయది.

ఉ. తన్ను సురూపమందునను ద్రవ్యము నందున జ్ఞానమందునన్
వన్నెగు విద్యయందమరి ప్రౌఢిమ పల్కులయందు మించు వా
రన్నులమిన్నలందు గన రాదన కూడని గర్వభావమై
యున్నది యిప్పుడా గరువ మూఱడు భంగి నొనర్పు గావలెన్

రుక్మి—దేవా! సత్యకు గర్వముగాక మరియొవ్వరి కుండును?

ఉ. బాయక రేబవల్ గనక స్వర్గమటంచును సత్యయింట నే
హాయిగ గాలమున్ గడుపుటందును, షష్టిగడెల్ సమాటలం
దాయపెత్తోనె పుచ్చుటయు దానను మీఁదగు లోకువెంచి తా
రాయసవర్తియై మిము నలక్ష్యముగాగని గాంచు మమ్ములన్

కావుననిందు దానితప్పేమియు లేదు మొదటమూర్ధమున కెక్కించుకొని యిప్పుడు దిగమన్నచో దిగునా!

శ్రీకృ—సఖీ! భర్తప్రేమ చూపించినచో భార్య రాయసవర్తియై మెలఁగవలసినదేనా?

రుక్మి—వారల యొక్క స్వభావమును బట్టి యుండును.

శ్రీకృ—అనఁగా మగవానిని బట్టియా మగువను బట్టియా?

రుక్మి—ఇద్దరి ననుసరించి కూడా యుండును.

శ్రీకృ—అనగా.

రుక్మి—అయినచో విమర్శనగా వచించెద వినండి.

చ. మగఁడు సరాగముల్ చెలిమి మచ్చిక జూపుకొలందికొందరో
మగువ లణంగి వంగిన యమాయకుల చాటున పిండివోలె నిం
పుగ గడుభక్తితో మెలఁగు పొంగుచు కొందరు టింగురంగుగా
వగగను సంచరింతురదె వ్యత్యయమై దనరాలు ఱాఁగకున్

శ్రీకృ—సరే తెలిసినది. భర్తృప్రేమ సాధ్వికి వినయమును ధూర్తురాలికి పెంకితనమును గూర్చుననియా భావము. నిశ్చయమే.

ఉ. ముద్దుకొనంగ వచ్చు నయమొప్పగ జెల్లెను నాలినందునా
ముద్దుల తారతమ్యమును పోల్పగ రాదుగ నెందు జెల్లిచన్
ముద్దుకొనంగ నొక్కకడుపున్ జనియించిన ప్రేమ, భాగ్యనో
ముద్దుకొనంగ నద్ది వలపుక్ జనియించిన ప్రేమ కాదొకో

అటులనే ముద్దనువది యొకటేయైనను చెల్లెలియందు వేరుగాను యిల్లాలునందు వేరుగాను వర్తించునటుల పూరుషుడు చూపు ప్రేమ సాధ్వియందొక లాగున జాణయందొక లాగున బరిగణించును

రుక్మి—(ఇటునటుఁజూచి) దేవా! ఏమిటీ వైచిత్ర్యము.

క. తెఱ చీరి వెడలి యాటకు,
నరుదెంచెడు తరుణి భంగి యఱ ముస్తాబై
హొఱంగుగ హాసుగ తక్కుచు,
నరుదెంచెడి సత్య వేష మదికను దేవా!

(అని వచ్చుచున్న సత్యను జూపును)

శ్రీకృ—తాను భూమిజ గావలెనను తలంపుతోఁ దాల్చిన వేషము.

(ప్రవేశము సత్య)

సత్య—(స్వగతమున) ఓహో! పెద్ద అక్కయ్యగారిక్కడనే యున్నవారు ఆక్షేపింపకమానరు అయిన నాకేమిభయము. (సమీపించి ప్రకాశముగా) దేవా! పట్టమహిషి చెంతను కలదనియా సత్య మాట మఱచితిరి (రుక్మిణితో) అక్కా! అంతేకాదు?

శ్రీకృ—(ఆశ్చర్యమునభినయించి) ఓహో! యిది సత్యయేనా? మాటలధ్వని ననుసరించి సత్యయనుకొంటిని గాని వేషముయొక్క మార్పును బట్టి గ్రహించలేకపోతిని.

రుక్మి— దేవా! మాచెల్లెలి వేషమెట్లున్నది.

శ్రీకృ—వేషమూ గుండి బ్రిద్దలగుచున్నయది. (హ్రూకిని జెంబు చేగ్పి) అమ్మ యొ్యా! జానకివలె లేదుకాని పచ్చి బోగము దానివలె యాతీవి యాషోకు యాహారంగు గనపట్టుచున్నది.

ఉ గండద్వయంబు స్నిగ్ధత జగాజిగి, కాటుక నైల్యమతులం
నిండినపై గనిక్యను, వినీలపు కుంతల కాంతి జగ్గు, కో
దండ యుగంబు మధ్య తళతళ్మను కుంకుమ బొట్టు నిగ్గు, నేల్
ఖండిత వాండిచూపుల దగద్ధగితంబు కనంగ చిత్రిమా.

ఉ. అచ్చపు పట్టు లుంగిపయి నయ్యరె! యింద్రి ధనస్సు రంగు ల
ట్లచ్చగు పట్టువస్త్రము పయింటగ దాలిచి, జూలు చొక్క పెం
పెచ్చుగ నాని వాల్జడను వేసుకొనంగనె బాల్యజానకీ
మచ్చున వేషముండు మొగమందము నెందున నొప్ప లేదుగా

రుక్మి—దేవా! పాపము కష్టపడియలంకరించుకొనిన మాచెల్లె లను నిట్టె తృణీకరించుచుంటిరి వేషము కేమిలోటు! రూపము మాత్ర ముభరిత్రిజను బోలలేదు. సత్యా! విలాసార్థముగా సంచరించెడి యుద్యానవనమందలి సౌధరాజమునంగల చిత్రఫలకములలో నొకంటి యైన "సీతావిహార" మను చిత్రఫలకమును జూచి యలంకరించు కొంటివి కాంబోలు అయితే పాపనికి బాల్య సీతనుగాదు కౌమార సీతను జూపవలె.

శ్రీకృ—మఱచితిని. నిశ్చయమే. జానకికి పదియారవ వత్సర మున బరిణయమైయుండు పదనాలుగేండ్లు వనవాసమైన పిమ్మట రాజ్యా భిషేక మొందియున్నది. అందువలన బాల్య, యౌవనములు దాటి కౌమార దశయై యుండవలె

సత్య—అక్కా! చేతగానివాండేపిగూ చేసెనన్నటుల వేషభా షలయందు నాకులొక్కయి యుండియు నన్నెగతాళి చేయుచుంటివా?

రుక్మి—అందులకేమి కదా శ్రీకృష్ణ భగవానులు కూడా నీకు లోనువయైనవాడు అందువల్లనే బుధులు:—

ఉ. వేషము భాషలందు మరి వేషము ముందుగ డంబుచేసినన్
భాషయె లేకయున్న సులభంబుగ గేలికి నాస్పదంబగా
భాషయొకల్లి వేష మది పాడుగ నుండిన నొక్క పద్ధతా
భాషయు వేషముల్ గలుగు వారల కందరు వశ్యులే కదా

సత్య—అక్కా! నీవువచించినట్లు వేష భాషలు రెండు నాసొమ్మయి నప్పుడు కౌమార సీతగా మారుటెంత?

రుక్మి—ఆ. అంతల్లా యింతయైనది. ఇంకనింతల్లాయెంతగునో!

శ్రీకృ—అనగా? బాల్యసీత యింతగా యొప్పినది కౌమార సీత గాని యొప్పదనియా భావము.

సత్య—(కోపముతో) కాదన్న నోటనే మరలఅవునని పించినట్లు మరల మీ చేతనే యొప్పించకున్న నన్నీ పేరను బిల్వవద్దు. ఇదె మరల వచ్చెద. (అని నిష్క్రమించును)

శ్రీకృ—సత్యకీసారి బాగుగా దాటియాకులు కట్టవచ్చును.

రుక్మి—అదెంతసేపు.

[అంతలోపల]

దేవరవారెచ్చట? (జాంబవతి ప్రవేశించి) అక్కగారితో నిచ్చట యున్నవారు. (సమీపించి) దేవా! నమస్కారము. దేవి!వందనము.

రుక్మి—స్వస్తి

శ్రీకృ—స్వస్తి! సఖి! ఏయొక్క

చ. చిరునవు మోము వైఖరియు, శీఘ్రముగా నిటకేగుటల్ కనన్
సరిగ దలంప నెద్దో సరసంబగు మేల్ సరి క్రొత్త సంగతిన్
గరితరో! నీవలన్ వినుట గల్గునటంచు తలంచి తెద్దియో
త్వరపడి చెప్పుమా మనసు తొందర జెందెను వింట కద్దియున్

జాంబ—(నవ్వుచు) ఉన్న అక్కగారుండనే యున్నారు. ఏవ అనదలంచినది యనియెద. దేవా! మీకు తొందర లేని దేవిషయము. ఏసమయము?

ఉ. ఎందున నెప్పుడేవిషయ మేపని యేవ్యవహారమందు మీ
రొందుట ముందు తొందరయొ

శ్రీకృ— ఓవనజేక్షణ! యందువల్లనే
క్రిందయి, నీకు మీదగుట కెందును మారుగ నుంటెగాక, జి
ద్ద్వంద్వాతుడైన నేను క్రియకన్నిట యందున శూన్యుడైతిగా

రుక్మి—[నవ్వి] చెల్లెలా! ఆయన ప్రత్యుత్తరములో నెంత చమత్కారమున్నదో యోచించితివా! తాను జగత్తుచే స్తుతింపబడిన వాడయ్యు నన్ని పనులయందును సూన్యుడట. అనగా తానేపనియు చేయుట లేదనియును తటస్థుడనియును వాటియంతట యవే జరుగు చుండునని వేదాంతార్థము ఇంక శృగార సంబంధమగునర్థము వలయు నేని నీయనుభవమును బట్టి యోచించుకొనుము. ఆయన నీయాటకు తగిన మద్దెలకాడె యగును నీకు నాకును తీసిపోవువాడనుకొంటివా?

జాంబ—అక్కా నీకును నాకేకాదు యీప్రపంచమునకే తీసి పోవువాడు కాడు. అందువల్లనే "అతీతుడ" ని పేరొందినవాడు

శ్రీకృ—చెలీ! మాటల సందున మఱతునను కుంటివా? నీరాకడ తెల్ప కూరకుంటివేమి?

రుక్మి—నేను చెప్పెదవినండి. మీకు భక్తుడును నామెకు జన కుడును నగు భల్లూక నాథుడు వచ్చియున్నవాడు.

శ్రీకృ—సరే ఆతడు యిప్పుడీనాటకమందొక పాత్రమేకదా? మన కబురుతో నిమిత్తములేకయే తలపని తలంపుగా నరుదెంచిన వాడు. ఆనందమే. సరే యది యటుండనిమ్ము. చెలీ! పుట్టినింటికి వెడలవలెనన్న అంత తొందరయేమి?

ఉ. జాయక పుంగలే దివిజసౌఖ్యముగా వచనంబులే సుధా
ప్యాయముగాను దర్శనము నాకము చిక్కినరీతి స్పర్శమో
పాయని మోక్షమందు ప్రియభార్యను దేవతగా దలంచు నా
ప్రేయసు నే తెలుంగునను వీడరుదెంతురు పుట్టినింటికిన్

అందునుబట్టియే మగువలు తెగువ గలవారందరు.

జాంబ—[రుక్మిణితో] అక్కా! యిందకు జవాబు చెప్పవలసిన దానను నైయున్నాను. కావున అనుగ్రహామిమ్ము [శ్రీకృష్ణునితో] ఆర్యపుత్రా! మీమాపలుకులు యథార్థములే! కాకున్న—

మ. నవమాసంబులు మోసిమోసి కని యానందంబుతో నెక్కడే
యవసాదంబును నొందకుండగను వెన్నప్పంబటుల్ పెంచి పెం
చవలన్ జవ్వనియైన పిమ్మట నొక య్యయ్యం జేతఁబెట్టంగ నా
ధవునున్నట్టి స్వతంత్ర మాకనిన మాతాత కేలుండదో

ముందు మీరలు దీనికి సమాధానమొసంగుడు. కష్టపడి పెంచిన తలిదండ్రులకంటె మధ్యవచ్చి పుస్తి మెడవేసినంత మాత్రమున మగఁడై యువిదపై యధికారము చలాయించుటను మొదలుపెట్టుసుకఁదా? అందువల్లనె మగవాడు తెగువ వారందురు.

రుక్మి—దేవా! ఏవిషయమందును మీరలు మాపయి నధికారము చూపనెంతురు మీరేకాదు ప్రతి పురుషుఁడు భార్యకట్ల నట్లనే కాని క్రియకు వారలే నణగిపోవుదురు. ఏమంటిరా?

చ. పురుషులమంచు•మీసమొక మూరెడు కల్గని స్త్రీలకంటె మే
మరయగ పైన నేవిషయమందున నుండగ రాదోకో యటం
చరమరలేక పైకెగసి సల్పుతలంపున నట్టిహాస మా
ఖరికిని క్రిందియయ్యెనడ గాటును తత్తర ముత్తదేకఁదా.

శ్రీకృ—[హృదయమున జెయివైచుకొని] వైదర్భీ! ఎంతపోటు పొడిచితివి? యిందు యోచన చేసినచో నెంత యద్భుతమైనను కలదు. కాని యిదినీస్వాభావము కాన నట్లంటివి సరే! జాంబవతీ! యిప్పటికీ రాక డయెందులకై

జాంబ—

క. దేవర జనకుని రాకను,
భావింపఁగ దెలుపుటొకటి పైనతఁ డిటకుఁ
రావచ్చునే మొ కనుటను,
నేనేవచ్చితి తెలిసికొనఁగ నిర్మలచరితా.

శ్రీకృ—సఖి! నేనేవచ్చి మీజనకుని ప్రశ్నించెదను. సీవీలోగా ఖగనాథుని వచనములు కపినాథుని రాకడను గూర్చి మీజనకునకుఁ దెలియఁ జేయుము.

జాంబ—చిత్తము. సెలవు [అని నిష్క్రమించును)

రుక్మి—సఖా! మరల వేషధారియై సత్య యేతెంచుచున్నయది

(స్త్రీవేషముసత్య)

శ్రీకృ—ఉండుటకేమున్నది? జిలుగు బుటేదారు చీరఁ గట్టి బాలామణి రైకను ధరించి ముక్తసరుగ వస్తువులను ధరించుట చేమిగుల నాగరికతగల గరితవలె నుంటివి!

ఉ. కాలున గజ్జలందియలు కంఠమునందున రత్నహారముల్
కేలను హేమకాచతతి కెంపుల బాహుపురుల్ భుజంబులన్
వీలగ గంటలొడ్డణము వీఁగున, ఫాలమునన్ దు రాయిరిఁ
దాలుప పెండ్లికాలమున ధాత్రిజ వేషము పుసగుండెగా

అందువల్ల "కల్యాణసీత" వేష మనవచ్చును.

రుక్మి—దేవా! సత్యము స్త్రీలు ధాత్రిజ వేషమువలె నున్నది యని పల్కితిరిగాని ధాత్రిజ యనరాదా?

సత్య— చాలుఁజాలు మీగడుసు నుడులు

చ. సరి సరి యెంతొ కష్టపడి జామరజాము నలంకరించుచున్
సరిగ ధరాత్మజట్టుల పసందుగ నచ్చున గుర్తినట్లుగా
నరయగ నేతయారవగ నయ్యది యోచనలేక లేఁతగా
బరిణయ సీతవేషమని పల్కితె సీతని పల్కరాదొకో

శ్రీకృ—అలాగున నలంకృతవైతివిగాని రూపమును మార్చు కొంటివా?

రుక్మి—దేవా! మీ ప్రేయసిని యట్లు తిరస్కరించుటను మన మెఱుంగని సంగతియేమున్నది?

ఉ. పాపము పాటుపెన్నొపడి వస్తువులున్నవి లేని కొన్ని యే
కైపునవో తగుల్చుకొని గల్గినవంతియె కాని జానికీ
రూపెటువచ్చు చేఁబదులు రూపుగ కొందమటన్న యేపతుల్
రూపమటుండు నుండినను రూపగ గైకొను టెట్లు దేవరా!

శ్రీకృ—అవును వస్తువులకు వాహనముల కెరవున్నది కాని రూపమున కెరవుండునా?

సత్య—ఈదినమున మీరిరువురేకమై నన్నేకుటకు ప్రారంభించిరి. సత్యయత్తవారెటులున్నను పుట్టినింటివారు మిగుల భాగ్యవంతులని యెఱుంగరా? నాకేమి యొకరింటికెరువునకు వెళ్లుట? ఏడు వారముల నగలు కలదానను.

ఉ. కూఁతుము నైననేనె కొడుకొప్పగ నైననునేనె అందుచే
మాతలిదండ్రి యాస్తికిని మానుగ వారసునైతిగాన నా
హేతువుచే మదర్థమున కెంతయు గుంది సపత్ని సప్తకం
బాతతమైన యీర్ష్యగొని ఆడుదురేగతినైన జెప్పగన్

అందుచే మాయక్కగారికి కూడా యీర్ష చూపుట సహజమే మీకేలకలుగవలె?

శ్రీకృ—నేనేమంటిని రూప మెరవు రాదంటిని.

రుక్మి—(కోపముతో) ఓసీ! నీవుభాగ్యవంతురాలవైనచో రెండు చేతులతోటి జల్లుకొనెదవు ఇంకా యెగా దిగా గొన్ని నగలు దిగవేసికొనెదవు. మామాట నీకేల? నీమాత్రము ధనము లేనివారెవరు? నేనావిదర్భ దేశాధీశుని పుత్రికను, జాంబవతి యంటివా భల్లూకచక్రవర్తితనూజ, కాళిందినంటివా? సూర్యతనయ ఆతఁడు జగచ్చక్షువు. ఆతఁడులేకున్న లోకమేలేదు మిత్రవిందఅవంతిదేశపుభర్తృపట్టి, భద్ర కేకయిభూపతికూఁతురునాగ్నజితికోసల రాజుకన్యక, లక్షణ మద్రపరేంద్రుని కుమార్తె ఇందులో నెవరునీకంటెతక్కువ

ఉ. ఆరయ నీసపత్నులు మహాధిపు పుత్రిక లెన్న నీవో సం
సారపు బిడ్డవక్క తనచో కెవరిందుఁ? పైకి ముందుగా
మూరెడు త్రుళ్లి, క్రుంగెదవు ముప్పది బారలు క్రిందికిక్క దులా
భారము నాటి చర్య తలపందగు నీమదియందు సోదరీ!

కావున నీకిది క్రొత్తయాయేమి?

సత్య—నీకది క్రొత్తకాదు. నాకిది క్రొత్తకాదు. "మంత్రముత తక్కువ తుంపరులెక్కువ"యను రీతిగా మాటల పసయేగాని క్రియపస లేదు.

రుక్మి—అనగా నీవు వేసిన వేషమునావల్ల కాదనియా?

సత్య—ఆ. నాకు పోలికలేకపోయినను వేషమైనను కుదిరినది నీవల్లనది కూడా కాదు కఁదా?

రుక్మి—అవును. నీవలెనే వేషములు వేయుట నావల్లకాదు.

సత్య—ఓహో! అట్లైన జానకీ యవతారము తాల్చెదవు కాఁబోలు

రుక్మి — కాకేమిటి?

సత్య — తాల్పలేకపోయిన?

రుక్మి — తాల్చిన?

సత్య — దేవా! యిందుకు మీరేమి వచించెదరు?

శ్రీకృ — నేనేమిఁ బల్కినను పక్షపాతముగా నుండును. నీవే చెప్పుము

సత్య — అట్లయినచో వినుండు.

ఉ. ఆరయ మూఁడుసారులు ప్రయత్నము మొనర్చుట ముఖ్యమెట్టివ్యా
పారముగాన నీతడవ బాగుగ ధాత్రిజ యంచు నభ్ర మొ
ప్పారెడు భంగి వేషమునవానకయుంటిని రుక్మిణీ పదాం
భోరుహమందు వ్రాలెదను పోలిన నాపదమందు వ్రాలనా
ముమ్మాటి కిదియే నాప్రతిన ఇదిగో వెడలుచుంటిని [అని నిష్క్రమించును)

శ్రీకృ — చెలీ! తొందర యెప్పుడు క్రిందుపఱుఁ ద్రొక్కివేయునుసుమీ.

రుక్మి — నిశ్చయమే. ఇప్పుడెంత తొందరపడితినో ఆనకంత నణగిపోవును. అంతియెకాదు గర్వభంగము కూడాయగును.

శ్రీకృ — చెలీ! యిదిగో తులసీదళము.

ఉ. ఆరిన సత్య గర్వమణగారఁగఁ జేసిన యట్లుగాదులా
భారమునాఁడు నన్ దులసి పత్రముచేఁ దులఁదూఁగఁ జేసి ఓ
సారసనేత్ర! యిప్పుడటు సల్పుటకై తులసీదళంబు స
త్కారిభితోడ నోటనిడుకొమ్ము ధరిత్రిజ రూపు తాల్పగాన్

(అని రుక్మిణీహస్తమందుంచును)

రుక్మి — (తీసికొని) దేవా! మహాప్రసాదము (కన్నులకద్దుకొని సమయమువచ్చినప్పుడు దీనిని వాడెదను. అంతవఱకు గుప్తపఱచెదను
(అని దాఁచును]

శ్రీకృ—సఖీ! సత్యకింతహంకారమెందులకో యెఱుంగుదువా?

రుక్మి—మిగులాగ్రహమునకు నగ్రగణ్యుఁడైన విశ్వామిత్రుడే సత్యగాజన్మించుటవలన

శ్రీకృ—నిశ్చయమే రూపము మాఱినను కోపము మాఱలేదు

(ప్రవేశము సత్య)

సత్య—యీసారి నేనచ్చముగా జానకీమచ్చుగా నుంటినా లేదా?

రుక్మి—నేనేమియు పలుకను. నీప్రియభర్తనే యడుగుము

శ్రీకృ—చెలీ! యిప్పుడు మొదలే పలికినది

ఉ కుచ్చులువోసి కట్టిన చొకాటపు తెల్లనిచీర గాగ నా
మచ్చుగనుంట, గుత్తపు సమంబగు రైక ధరింపఁజించుకుఁ
వచ్చెడు భంగి చాచికను పట్టుట, వేవలి పట్టుకుచ్చులిం
కెచ్చినితంబ యుగ్మమున నృత్యముసేయుట జూడయెంతో నా
కచ్చెరువయ్యెనెవ్వరు కులాంగన వేషమటంచు నెంచరా

కానీ యింతవింత వేషము నాచెంతనెప్పుడును వేసియుండలేదు కదా? ఆహాచెలీ!

సీ ముంగర వజ్రాలరంగు మోమున నాడ
కెంపు ముద్దుల కాంతి చెంపలంట
పవడ ముత్యపు సరుల్ హావణింప నెదమైన
నీలపుం గరములు వేల్లఁ గ్రాల
వైడూర్య వంకీలు ప్రభ బాహువుల నొప్ప
పదముల కడియాలు పచ్చలలర
గోమేధికపు తురాయి కులుకాడ శిరమున
పుష్పపు చేర్చుక్క పొల్పెసంగ

శ్రీకృ—[భయము నభినయించి) చెలీ! సత్యా! ఇంతియేనా నీడాంబీకము. నీవు తప్పక భూమిజ క్రింద మారగలవని యెంచి నమ్మినందులకు గొంప ముందునకు దెచ్చితివే. ఇదియేమి పాపము వాయుజుం డరుదెంచు చున్నవాఁడు. మిగుల కోపి. సీతారాముల దర్శనము కాకయున్న మనసై మండి పడఁగలఁడు. కావున త్వరితము గా అనగా యిక్కడున్నట్టుగా నొకచిటికలో సీతవై రావలెను.

సత్య—దేవా! మీకు వేయి మాయక్కకు పదివేలు నమస్కారములు నన్ను బాధింపకుఁడు

ఉ ఇంతకు మించి వేషమును నేను ధరింపఁగఁజాల రామ భూ
కాంతుని వేష మచ్యుతుఁడు కాంత ధరాత్మజ వేషమీవు దృ
ష్టాంతముగా గనంబఱచి చక్షుల పర్వము సేయఁగోరెద
భ్యంతరమేమి లేదు నను నాదక నంజలి గొంచు నిర్వరుఁ

[ఇదే వేనవేలు నమస్కారములు)

రుక్మి—సత్యా! నీవు నిష్కల్మషురాల వగుటచే నీయెడ బ్రిసన్నురాలనైతిని యిదే నాదెస విలోకించుము. [అని తులసీదళమును చూపి] చెల్లెలా మఱచితివా!

ఉ నారదమౌనివర్యునకు నాథుని దానమొసంగగా "తులా
భారము" నెండిగ్రంథమును ప్రిచ్చగజేసెనునాఁడు, చెల్వనే
డారయ "గర్వభంగను" ను సద్భుత పాత్రము వెల్వరించెదా
భారము నొందె యీతులసి పత్రము చిత్రముగాంచు మిత్తఱన్

(అని నోట వైచుకొనఁగా భూమిలోనికి ఁగిపోవుటయు వెంటనే యంతరిక్షమున జానకీ రూపముతోఁ బ్రవేశించుటయు జరుగును)

శ్రీకృ—నెచ్చెలీ! [పైకిజూపి) అల్లదే జానకిని విలోకింపుము.

సత్య—[పైకిజూచి ఆశ్చర్యముతో] ఆహా యేమినాపూర్వ పుణ్యము, అద్దిరా! నాజన్మసాఫల్యము, అయారె!నాభాగ్యము. నేఁడు కదాధన్యనైతిని.

ఉ. అప్ప! జోహారు గైకొను మహత్వమెఱుంగక జేసినట్టి నా
తప్పును సైచి, యీవె జగదంబవు లక్ష్మివి కాకయున్న నీ
విప్పగిదిన్ మహింజను నిట్టి సురూపము తాల్చుటెట్టు నే
నొప్పగ ధన్యనైతి గద యుర్విజ దర్శన మబ్బె యక్కటన్

కానిమ్ము మొదటనే నిష్ఠురమాడినను పిదపనదియే శుభసూచకముగా బరిణమించినది [శ్రీకృష్ణుని జూచి] దేవా! మాయక్క సీతగా మారినట్లు తాము శ్రీరామునిగా మారి నేత్రోత్సవం బొనరింప వేడెద.

శ్రీకృ—మంచిది. ఇదిగో యీతులసీ తావళము వీక్షింపుము. నీవు తులసీప్రభావ మెఱుంగవు దాని మహిమం బాకర్ణింపుము.

సీ. ప్రాణవాయు వెపంగి ప్రాణంబునకు హాయి
కలిగించి ముద మిచ్చు తులసివనము
వెలలేని రుచిగొల్పి తొలగించి రోగముల్
తులలేని సుఖమిచ్చు తులసి తీర్థ
మలఘు మూర్ధమునందు తలకొన పుణ్యంబు
తోడరంచి రక్షించుతులసి దళము
శాశ్వతకైవల్య సంపాద్యమున కెన్న
నలరు సోపానపంక్తి తులసి మాల
తే. గీ. తరుగని సిగసంపదలకు తావకంబు
సలుప లక్ష్మిని నెలకొల్పు తులసి కోట
వలయు కోర్కెలు నొనగూర్చు పట్టునందు
పొలుచు వెలి మ్రాను క్రింద నాతులసి మ్రాను.

అట్టి మహామహిమంబుగల తులసి మ్రానుచే నేర్పడిన తావళమును ధరించి శ్రీరామచంద్రునిగా మారెదను. ఇదిగో వీక్షించుము. [అని తులసి తావళము కంఠమున ధరించగానే భూమిలోనికి క్రుంగి యంతరిక్షమున శ్రీరామాకృతితో సీత ప్రక్కను కూర్చొని యుండును

సత్య—(పైకి వీక్షించి) ఆహా! శ్రీకృష్ణా! దేవకీనందనా! ఎంత మూఢురాలను?

ఉ. ఈవును నాపలెన్ నరుఁడవే యని యెంచి యనేక నేరముల్
దేవర! మీయెడన్ సలిపితిన్ గనలేకను కంటి నిప్పుడున్
గేవల మక్షరుండజిత కేశవుఁ డచ్యుతుఁ డద్వితీయ సం
భావనతేజ రూపమగు బ్రహ్మము నీవె యటంచు నెఱింగితిన్

[దోసిలొగ్గి] మహాత్మా! ఎఱుఁగక చేసిన నాయపరాధములను నెఱింగి పశ్చాత్తాపము నొందినందులకు నన్ను క్షమింపఁ గోరెదను. ఆహా! సీతారాముల దర్శన మబ్బుటకు నేనెంత ధన్యాత్మురాలనో కదా? ఇఁక నాకు జన్మరాహిత్యమే.

మ. సృష్టి కెంచఁగ బ్రహ్మవై స్థితి కెన్న విష్ణువవై, లయిం
చష్టమూర్తి వెవ్వైన దేవ మయాకృతంబగు పుణ్యమే
అష్టకష్టము లొంది నిద్దుర యన్న మన్నది లేకయే
సృష్టిచేసిన చిక్కనట్టి త్రిమూర్తి బ్రహ్మము చిక్కెఁగా.

హే దేవాదిదేవా! అధ్యాత్మా!

శా. నిత్యానిత్య వివేక శూన్యులు సదా నిత్యంబె సంసార మం
చత్యానందముతో మహాజడవదే యంచాదు లోమున్గుచున్
నిత్యంబైన పరాత్పరున్ గొల్చి సాన్నిధ్యంబు నొందంగ లే
రత్యర్థంబగు కష్టమొందు ధన దారాపుత్ర మోహాత్ములై

హే మహాత్మా! సచ్చిదానందా!

శా. సర్వంమిథ్య యటంచు నెంచకయె యజ్ఞానంబుచే మత్తులై
గర్వాంధంబున కూలి మిట్టిపడి విజ్ఞానంబు నెట్టియా
సర్వజ్ఞున్, సగుణాత్మునిన్, గుణిని సుజ్ఞానంబుచే గాంచ లే
కుర్విం జచ్చుచు పుట్టుచుండ్రు జనులే హా యోఁగాదు దుఃఖాబ్ధిలోన్

ఇప్పుడీ సంసారముకల్ల. యీజన్మము నిగర్థసార్థకము. పుత్రుఁ డెవఁడు, పుత్రికయెవతె? భర్తయెవఁడు? భార్యయెవతె యెవరికివారె?

యెవరి సుకృత దుష్కృతములు వారినే కట్టికుడుపును. ఆహా! నాటకశాలలో వేషధారి తన పాత్రముయొక్క పరిష్కరణము ముగియగానే నిష్క్రమించినటుల మనుజుఁడు ప్రపంచమనే నాటకశాలలో తాను జేయవలసిన కృత్యములన్నియు ముగియగానే గతించును. హే సీతా! సుగుణోపేత! నీవే యాదిశక్తివి. ఈప్రపంచమంతయు శక్తిమయమై యున్నది. త్రిమూర్త్యాత్మక స్వరూపమందు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు కలసి యుండినటుల శక్తిరూపము గు నీయందు సరస్వతి శ్రీపతి పార్వతి యను మూఁడు రూపములు కలవు నీవు జ్ఞానయిచ్ఛా క్రియాశక్తివై యీప్రపంచమును నిండి జీవకోటిని తోలుబొమ్మలుగతిగా నాట్యమాడింతువు. అంతియెగాక ఉత్సాహ ప్రభుత్వ మంత్రశక్తులలో ముంచి యనేక ఘనకార్యములు తటస్థముగా నుండి యొనరింపఁజేతువు. వేయేల? శక్తి ప్రభావమునకు లోనయి పరబ్రహ్మమూర్తి కూడా సంచరింపకున్న ఆ శక్తి గతియేమి? ఆహా! తల్లి! గుణముల పాలవెల్లి!

మత్త. శక్తిరూపము దాల్చి సత్వర [illegible] గా [illegible] వర్తివై
శక్తితో నిల జీవకోటిని జ్ఞాన [illegible] రాము [illegible] ముక్
భక్తినొందఁగఁజేసి దుఃఖప్రమోద వార్ధిని నా [illegible]
రక్తిగా నొనరింతువౌ భువి రంగ నాటక శాలలోఁ

హా సీతారాములారా! యీదానిని యీపాపురాలను యీనీచ మానిసిని మీపదారవిందంబులయందు జేర్చుడు. మోక్షమిప్పింపుడు. మీయందలి భక్తి పరవశముచే నాకరిక మునకేమియు కొదువలేదు. హా రఘురామ! హా జానకిరామ! హా సాకేతరామ! హా కౌసల్యరామ! హా దశరథరామ రక్షింపుము దరిఁజేర్పుము, సాగుముపోవుము కావుము. [అని మూర్ఛ వోవును)

[తెరవాలును]



శ్రీరస్తు.

శుభమస్తు — అవిఘ్నమస్తు

# గర్వభంగము



అందు

## ఆంజనేయ గర్వభంగము



## చతుర్థాంకము

---

(అయోధ్యగామారిన ద్వారక దశరథుని మందిరముగామారిన వసుదేవుని మందిరము యొక్క ముంగలి హాలు]

[ప్రవేశము ఆంజనేయులు]

ఆంజ—(అతిసంతోషముతో) ఆహా! ఏమీ యీసుదినము! ఆహా! ఏమీ నాభాగ్యము. ఆహా! ఎంతకాలమునకు గంటిని దశరథేశ్వరుని మందిరము!

ఉ. రామవిభుండు భూమిజయు రాజ్యపదంబు గ్రహించునప్డు నే
భీమపరాక్రమ విక్రము విభీషణుఁ డర్కజు జాంబవంత సం
గ్రామ ధురంధరుండు రణకౌశలురైన సుషేణ నీలురా
గ్రామణులొప్ప దైత్య కపికాండముతో నలనాఁడు గంటిగా

ఆహా! అప్పటికిప్పటికి మార్పేమియు గానరాదే (ఇటునటుఁ జూచి) ఇది దశరథునియొక్క సభామండపముయొక్క ముంగలిహాలు అప్పటి చిత్రపటములే యిప్పటికిని చెక్కుచెదరక సరిక్రొత్తపటముల వలెనే యున్నవికదా ఏమీ?

చ. ప్రజల మనంబు రంజిలు స్వభావపుచేతల చేతనొప్పెడా
అజమహారాజు నాదశరథాధిపుఁడమ్మహాభార్యలాది నీ
రజసఖు వంశరత్నముల రాజిత చిత్రపటంబు లెన్నొ న
క్కజమొనరించు చూపరుల కక్కట నాటికి నేఁడు గంటిగా

[అని కొంచెము ముందుగా నడచి] ఆహా! యీచిత్రపటమేమిటియో యనుకొంటిని ఇదియా?

చ. పరగుణుఁడైన రాము వనవాసము కంపుట కైక, ఎంచ మం
థర చెడుబోధ హేతువని ధాత్రికి గూలఁగఁ ద్రోసి గట్టిగా
నురమున గూరుచుండి కడునుగ్రత ఖడ్గమునెత్తి పొడ్చెడా
నెలవున నున్న నాభరతు విగ్రహ మప్పటి కిప్డు గంటిగా

ఆహా! యీతఁడచ్చము గామా రామచంద్రునిమచ్చుబోలియున్నవాఁడు [కొంచెముముందుగానడచి) ఓహో! వీరలెవరో యనుకుంటిని.

ఉ. ప్రేమను దండ్రిమాట నెరవేర్చుటకై వనికేగుచో నదిన్
గోముగ దాఁటనోడ పయిగూర్చొని యుండిన రాము బాహువై
మోము కరంబులానుకొని భూమిజ ప్రక్కను లక్ష్మణుండహో
బామున గూరుచుండ నడుపన్ గుహుఁడోడను గంటి క్రొత్తగాన్

కానీ యీచిత్రపటము రాముని కృతాభిషేకమునాటికి లేదు పిమ్మటవ్రాసినదై యుండవలెను. [కొంచెము ముందునకు నడచి) ఓహో! ఇదియా "మాయకురంగము" ఓరీ! మారీచా! దుష్టరాక్షసా! నీవేష మద్భుతముగా నున్నయది.

ఉ. చంగున చంగుప్రేల్లుచును చట్టిటు చూచుచు మేఁతమేసెడా
భంగిని సాచుచట్టునిలపైకిని, డెక్కలచేత కంఠమున్
రంగుగ గోకుకొంచును హారంగును భూమిజ పొందులాగు ముం
దంగుగ నాపు పైడిమొగ మద్భుత చిత్రము గంటి వెండియున్

బలే! యీచిత్రకారకుఁడెవఁడో నేర్పరికాఁడే అతి స్వభావసిద్ధముగా లేఖిని చిత్రించియున్నవాఁడు (కొంచెము ముందుకేగి] ఓహో! యిదియే మో యనుకొంటిని. ఈచిత్రప్రతిమ "సీతాపహరణము" కాదా? భళిరా!

ఉ. తీక్కట శుద్ధశ్రోత్రియుని యంగుగ వేషము దాల్చి, బిచ్చమం
చక్కఁజ వెట్టి వింశతి భుజంబులు పంక్తిముఖంబు లట్టె జా
పక్కజమొంది మూర్ఛఁగొన నారమ ధాత్రిజ తోటి పెల్లగా
గ్రక్కున నెత్తి తేరునిడి రావణుఁడేగెడు చిత్ర మిద్దియా

సరే సుగ్రీవునితోఁ జెల్మి మొదలు వాలి సంహారణంబు వారధి బంధనము అంగదు రాయభారము విభీషణు శరణము మేఘనాధునివధ రావణకుంభకరుణులమరణమూదిగా గల చిత్రఫలకము లింకనేవీక్షించుట కవసరములేదు. ఎందుచేతననగా నవియన్నియు నానేత్రంబుల యెదుటనే జరిగినవి అంతియె కాదు నావల్లనె జరిగెనని కూడా చెప్పగలను నేను రామ లక్ష్మణ భరత శత్రుఘ్నకుమారులను చిన్ననాఁడు గాంచితిని వారల చిత్రపటమిప్పుడొకసారి ప్రియమార నయనపర్వముగా వీక్షించవలె [కొంచెము ముంగలకు నడచి] ఆహా! యీపెద్ద పటమే వారల ప్రతి బింబ స్వరూపములు కలది.

సీ. కుసుమ ధ్వజునిరూపు కుశలవుల్ వీరెగ,
రాఘవేశ్వరునిగా రాముసుతులు
చంద్రునేలు మొగంబు చంద్రకేతాంగదుల్,
లక్ష్మణు ననుఁగు బాలకులు కారె?
నిష్కల్మష మతులు పుష్కరతాక్షులు,
భరతుని నెయ్యంపు పాపలే యగు
శత్రుసంహారులౌ శత్రుఘాతి సుబాహులు,
లె నయశత్రుఘ్నుని తనయులగును

తే. గీ. అచ్చముగ వీరు జనకుల యచ్చుపోలె
ప్రిబలుటయు నందనీ చిత్రపటమునిఁాద
ప్రితిమ క్రిందను నామముల్ వ్రాయఁబడుట
బట్టి యూహింప గలిగితి నిట్టి నేను.

(క్రిందికిచూచి) యీచిత్రము లెంతరమణీయముగానున్నవో అంతకు వేయింతలు రమణీయముగా నీమహాలు కొలఁకు నేల కన్పట్టుచున్నయది.

ఉ. అచ్చముగా నొకేసరిగ నంగళి మెత్తగు పచ్చబైలు నం
దచ్చట నచ్చటన్మెరయు నట్టి మెఱుంగుఁడు పుర్వులట్లుగా
బచ్చల రాలపైఁబొదుగ బడ్డ విడూరపు రత్నకాంతి య
మ్మచ్చుగ నుంటగాక నొక మాదిరి తివాసిగ గానుపించెడుఁ

ఇఁక వీఁటన్నిఁటితో నాకుపనిలేదు. మా రామచంద్రుని దర్శనముకావలెను. ఏనానంద సముద్రములో నోలలాడవలెను. హా రామా! సుగుణాంబుధిసోమ! ఓసార్వభౌమా, ఏకీమహాత్మా నన్నుఁను. (అని ధ్యానించుచు నిలువంబడును.) (గొప్ప ధ్వని వినఁబడగానె అంత తెలివిలేచిపోవును శ్రీరామ రూపధారియగు శ్రీకృష్ణుఁడు పాముకులపైఁ బచారు చేయుచుండును)

అంజ—(ఉల్కిపడి నేత్రములు విప్పిచూచి) ఆహా మా రామచంద్రమూర్తిదర్శనమెన్నాళ్లకు కంటిని.

మంగళమహాశ్రీవృత్తము.

రామ! రఘురామ! జయరామ! గుణధామ! యభిరామ!
రవిసంతతికిసోమా!
నీమహిమ లెన్నగ ఫణీశ గిరిజేశ
ధరణీశయమరేశ విధికైన

స్నేమియును శక్యమన నెట్టిదియో
కానుపడ దేననగ నెంతగాని యాహం
నీమహిని జీవగణమెల్ల సృజియించి స్థితి
నింపగలయింపఁ బతినీవా

• దేవాదిదేవా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా!
ఆది మధ్యాంతరహిత! నీ
కృత్యములత్యద్భుతములు!
నీవైదములమోఘములు. మహాత్మ!

ఉ అంతము లేనినంతముల నంతముగా సృజియించి వానిగ
ల్పాంతముజేసి క్షీరనిధియందుఁ బాపఁ పత్రశాయివై
కొంతవడిన్ గతింప వెనుకొయ్యన నంతము లేనవంతలో
కాంతములన్ సృజించి స్థితియాంతమొనర్తు వదేమి చిత్రమో

(అని శ్రీరాముని పాదములపైఁబడును)

శ్రీరా—(లేవనెత్తి) ఆంజనేయా! క్షేమమా

ఆంజ—చిత్తము. తాము:—

ఉ. కారణ మింత లేకయె యకారణమున్ మమపూర్వపుణ్య సం
స్కారము బట్టి రాజ్యరమ కాంచెడి కాలము నందు నీకు దు
ర్వారపు మిత్తి లేదనుట బట్టియె జీవను లేకఁ జేవలం
చేరుచు నున్నవాఁడ తమ దివ్య వరప్రభవాతి శక్తిచేన్

శ్రీరా—ఓయీ! కారణమైన ప్రేమయే నీయెడల మాకుగలదు
ఎమంటివా?

ఉ. వాయుజ నీదుసాహస మవారణ శక్తి విచిత్రయుక్తి ఆ
పాయపు భక్తి వ్యక్తమివి యున్నియు మిక్కిలి రక్తి నిచ్చి రా
మాయణ గ్రంథ రాజమున కందములైన ననేక లంక్రియల్
తోయముగాను భేదపడి తోషము గూర్చుచు విన్నవారికిన్

అందుచే నీవులేనున్న రామాయణ గ్రంథమే లేదు. ఒకవేళ యుండినను రక్తిగా యుండదని నాభావము

ఆంజ—దేవా! యింతగొంతయు తమయొక్క యనుగ్రహమే

శ్రీరా—ప్రాకారము చేయుచు పాపని! నీనివాస మెచ్చట?

ఆంజ—దేవా! అది దేవా!

ఉ. ఉత్తమమైన నివాసము నొప్పుచు కన్నుల పండువై సదా
ఉత్తమ గాలి వీచుచు సుశోత్తమమై మదికెంతొ హాయి గూ
ర్చుత్తర సంద్రతీరమున నొప్పగ నేతప మాచరింతుగా
నుత్తర లోకమొందఁ బురుషోత్తమ నిన్నె మదిన్ జపించెదన్

శ్రీరా—నాభక్తుఁడవగు నీకు నరకముండునా?

ఆంజ—చిత్తమట్లనే.

శ్రీరా—ఓయీ! దశగ్రీవుని ద్రుంచిన పిమ్మట నీకు నేనిడిన యానతి జ్ఞాపకమున్నదా?

ఆంజ—చిత్తము లేకనేమి?

ఉ. ఆజిన పడియుండిన దశాస్య శ్మశాన మతండు జీవియై
ఘోరపు వర్తనంబున నఘోరముగా బ్రజలన్ వధించి సం
సారుల గొంతుఁగోయుచు వ్యభిచారుఁడు గావున గొప్ప ద్రుమాంకు కా
డారక యుండునట్లు పడుచుండు మనంచు ననుజ్ఞ నీయరే.

మీయాజ్ఞాను సారముగా ప్రతివత్సరము సంక్రాంతికి గొప్ప మ్రాఁకు నొకదానిని గొనిపోయి దశాస్య శ్మశానమున వైచి విభీషణుని దర్శించి యాతనితో నా ప్రొద్దుగడపి మరునాడు కిష్కింధ కేతెంచి సుగ్రీవ యంగదాది వానర చయముతోఁ గాలము పుచ్చి మరునాడు మరల యుత్తర సముద్రమునకుఁ జేరెదను. ఇటుల ప్రతిసంవత్సరము వాడుకగా యున్నయది. కాని దేవా!

ఉ. ఆదరమైన ప్రేమమున హస్తమునందున హేమ పాత్రినా
మోదముతో ధరించి కచపూగముపీడ, పయింటఁజార, మేన్

స్వేదము గ్రమ్మ నశ్రుల ప్రవృత్తి స్రవింప. జలంబు నెత్తి మం
డోదరి తద్భర్త చితి నూల్కొని యారిన జీవికానగున్.

పాపమామె యవస్థ చూచిన యప్పుడెల్లను చాలా విచారముగా నుండును కానీ లోకకంటకుఁడగు దశకంఠుని గుణంబులు తలంచిన నంతలో సహంకార ముదయించును.

శ్రీ రా—విభీషణుఁడెన్నఁడైనా నన్ను స్మరించునా?

ఆంజ—దేవా! ఎంతమాట సెలవిచ్చితిరి? రాజ్యభిక్ష పెట్టినవారలు తామగుటవలన నాతఁడెట్లు మఱచును?

ఉ. సీతులు ప్రీతివల్కి, నసిసీతుఁడు రావణుఁ డట్టివెల్ల పె
న్బ్బాతులుగా తలంచి కడు ఫూనికఁ దన్నిన దన్నుతోటి మీ
యాఁతను జేరి మిమ్ము నొక నూఁతగ జేకొన్ని పొందినట్టి సం
ప్రీతగు లాభవిస్మృతి విభీషణుఁ డెన్నటికైన జెందునే.

ఆతఁడుదయంబుననే లేచి స్నాన సంధ్యానుష్ఠానములు ముగించుకొని తన సౌధరాజమున కెదురుగా నిర్మింపఁబడియున్న "శ్రీసీతారామ" కోవెలకేతెంచి ముందుగా మిమ్ముల నర్చించి పిమ్మట మీచే స్థాపింపఁబడిన "రామలింగేశ్వరస్వామి"ని పూజించుటకై రామేశ్వరమునకేగి యటనుండి లంక కరుదెంచి తన యగ్రజునివలెనే సహస్రలింగార్చన గావించి రెండుయామములకు భుజించును. పిమ్మట రెండు మూఁడుగడియలు విశ్రాంతి జెంది తరువాత రాజకీయ వ్యవహారములను జక్కపెట్టుకొని సాయంకాల భోజనానంతరమున పురాణ కాలక్షేపము జరిపి పిమ్మట శయనించును. కాని దేవా! సంక్రాంతినెల ప్రారంభించినదే మొదలు నారాకకై యాతఁడు వేచియుండు. నన్ను గన్నదినమున నాతని సంతోషమేమని వచింతును. ఎంతసేపు మిమ్ములనుగూర్చియే ముచ్చటించుచుండును అటుపిమ్మట సుగ్రీవాంగదులను దర్శించుటకై కిష్కింధకేగెదను.

శ్రీరా—ఆ. ఆగుము. వారల సంగతి యేటున్నది?

ఆంజ—దేవా? వారలకేమి లోటు?

ఉ బంధురమైన తారయును భార్యలు ప్రక్కను నిల్వ రాజ్య సం
బంధపు కార్యముల్ నెఱుప వాలితనూజుఁడు నీలుఁడాది స
ద్బంధులు రాచకార్యములఁ బ్రాజ్ఞాన మంత్రులరీతి నేలు కి
ష్కింధను సూర్యపుత్రకుఁడు శ్రీరఘురాము పదాబ్జ చిత్తుడై

సుగ్రీవునను దోచనప్పుడు వాయుపు విమానముమీఁద విభీష
ణుని దర్శించుటకు లంక కప్పుడప్పుడేగుచుండుదును.

శ్రీరా—మీకు నాయందెట్లు భక్తి కలదో నాకు మీయందట్టి
ప్రేమకలదు చూడుము. శ్రీకృష్ణావతారకాలమందు నీయందుంగల
యమిత ప్రేమచేతనేకఁదా పార్థుని సురదంబుపై కపిధ్వజమేర్పాటు
చేయించితిని.

ఆంజ—చిత్తము. ఆసమరమంతయు వీక్షించితిని అందొక
యసంగతి యొనరించితి నాపాలకై క్షమింపుడు. చేసినపాపము చెప్పిన
నుండదుకఁదా దేవా?

చ. వడివడి దుస్ససేనగదు [illegible] తదీయరక్తమున్
గుడగుడఁదాగి ప్రేవులు బుజ్జుకమందున జన్నిదంబు ల
ట్లుడుగకఁదాల్చి దుష్కృత మహాగ్రమై నర్చుట, ఘోరరూక్షమై
యడరుట భీమసేనుఁడు మదాంశయించు టె కారణంబెగా

శ్రీకృ—ఆకాలముఁందే యాసంగతిని [illegible] కిరీటి కెఱింగించి
యుంటిని. సరే రామ రావణ సంగ్రామము సీత మీఁదుగానే జరి
గినది. భారత సంగ్రామము నీవు కన్నులారా [illegible] యుంటివి.
ఈరెంటిలో నేది మహాసంగ్రామమని వచింపనగును.

ఆంజ—[నవ్వి] దేవా! కురుపాండవ సైన్యమంతయు ననగా
గజ తురగ రథపదాతి బలమంతయు గలిపి పదునెన్మిది యక్షౌహిణిలు

అక్షౌహిణి యనగా నిరువదియొక్కవేయి యెనిమిదివందల డెబ్బది రథములు. అన్ని యేనుగులు వాటికి మూడింతలు గుఱ్ఱములు అయిదింతలు కాల్బలము కలవి. అట్టివి పదునెన్మిది యక్షౌహిణులు అనగా నలుబదిలక్షలు. ఇందులోనే రథ గజ తురగపదాదులున్నవి. అంతియే కదా? చూడుడు?

ఉ భారత యుద్ధమందు కురుపాండవ సైన్యము లెక్కజూడగా
భేరి మృదంగముల్ బటహ భీకర వాద్యములన్ బొనర్చుచున్
బోరుట కిరీటదజిత్తు రుగుపూటను వెన్కొని వచ్చి నంత మం
దారయలేరె? యెట్లగు మహారణ మియ్యది పోరుగా కిలన్

ఇదియొక యన్నదమ్ముల జగడముగాని దారుణరణము కాదు. తామొక్కటి యోచింపుడు. భారత వీరులలో ముదుసలులో భీష్మద్రోణులును, కుఱ్ఱవాండ్రలో అభిమన్య ఘటోత్కచుడు తక్క శూరులేరి? ఇంక రామాయణముందంటిరా? అతికాయ మహాకాయ కంపన అకంపన ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమ కుంభిని కుంభిపార్శ్వ మహాపార్శ్వాది వీరాధి వీరులే గాక స్వర్గాధిపతిని జయించిన యింద్రజిత్తు, ముల్లోకకంటకుడగు దశకంఠుడు మహాబలుండగు కుంభకర్ణుడు వీరల సంగతి యోచింపుడు. వీరిముందు భారత యోధులు, భారత శూరులు భారతవీరులు లెక్కేమిటి పత్రిమేమిటి.

శ్రీరా—నిశ్చయమే వాయుజా నిశ్చయమే. (అని తూలుట అభినయించి తిన్నగ నిలువంబడును)

ఆంజ—మహాత్మా! ఏమటుల తూలిరి?

శ్రీరా—ఓయీ! నేను పచారు చేయుచుండగా నాపాదుక డెక్క కీగువ్వరాయి (అని పాదుకడెక్కతో జూపుచు) తగిలియుండనోపు అందువలన తూలియుంటిని.

ఆంజ—[పరికించి] దేవా! నిశ్చయమే సెలవైనచో నీరాతిని పెకలిం
చివైచెదను.

శ్రీరా—పోనిమ్ము దానితో మనకేమి పనియున్నది?

ఆంజ—దేవా! దీనిని నిర్లక్ష్యము చేసి యూరకుండరాదు ఇది యిప్పుడు మిమ్ముల తూలింపఁజేసినట్లుగా ముందు ప్రమాదమగు దెబ్బకలిగించుటకు గారణభూతమై యుండనగు. మీదాసుఁడీ మాత్రము స్వల్పకార్యమొనర్చలేఁడని యెంచక పెకల్చి పాఱవేయుటకు సెలవిండు.

ఉ వాలమునందు నూర్లు తలపై భుజయుగ్మమునం దనేకవేల్
కేలులయందు లక్షలుగ క్రిక్కిరిగ పర్వతపంక్తి నెత్తుకన్
ట్రీలగ కేరుచున్ నగచు తీవ్రత గెంతెడు బాహుశాలికిన్
వీలగు గుల్కరాయి యొక లెక్కయె మీటక కాలి గోటితోన్.

ఇదిగో తాము చూచుచుండగనే యెడమకాలి గోటితో మీటివైచెదను (అని యెడమకాలి గోటి రాతిని మీటించి) అబ్బా! ఎంత దెబ్బ!

శ్రీరా—(నిలువంబడి హనుమ పాదము వీక్షించి) హనుమా! యిదేమియాశ్చర్యము. బహువిత్రముగా యున్నదే

ఉ. మజ్జరె! యంచు బేర్కొని అమర్త్యులు వార్ధిని దాఁట లంక కీ
వజ్జలు నేల నూనికయి లల్లనవూఁచి గుభాల్న దాఁటెడా
యజ్జను, నావలొడ్డునకు నర్మిలి దూకెడి కాలమందునన్
ముజ్జగముల్ చలించె మిను ముట్టెను నీపద లంఘు నాదముల్.

అట్టి దృఢమైన నీపాదమునకీ గువ్వరాయి, యీబొమ్మరాయి మీటింప కదలకుండుటయే కాక పాఁదము కాలిగోరు బ్రద్దలై నెత్తురు జొబ్బిల్లుచున్నయది. ఇంక నాప్రయత్నము మానుము.

ఆంజ—మహాత్మా! గుడి మ్రింగువానికి యందలి లింగమొక

లెక్కా? యనుతీరుగా కొండలు చెండువలె నెత్తిన వానికీ గులకరాయి యందెన్నపవంతు — అప్పుడట్టు జాతియుండనోపు. ఈసారి యట్టు లకాదు (అని కూర్చొని) దేవా! శ్రీరామచంద్రా! బొట్టనవ్రేలుచూపి

ఉ. బొట్టన వ్రేలితో నమి పూనికతో నొక నెట్టు నెట్టినన్
మిట్టి పడన్వలెన్ సరిగ నిస్సున ముట్టడి యంత యెత్తునే
గుట్టలు గుట్ట లిట్టికొన గోటను నెత్తగ నిద్ది లెక్కె మీ
రట్టు కనుండి యీగులకరాయి ప్రభావము నాప్రతాపమున్

(అని బొట్టన వ్రేలితో నెట్టి త్రోయ ఘల్లుమని శబ్దమువినఁబడ పావని బొట్టనవ్రేలిని రెండవహస్తముతో బట్టుకొనును]

శ్రీ రా — ఇదేమీ? యీధ్వని. రాయియాడినదా యేమి?

ఆంజ — (కొంచెము సిగ్గుతో] అయ్యా? రాయి తూలిపడలేదు గాని బొట్టనవ్రేలి యెముక విరిగి ధ్వనిచ్చినది.

శ్రీ రా — అయ్యయో! యిదియేమి పాపమోయి. మహాసముద్రములన్నియును దాటి పిల్లకాల్వలలో దాటలేక బడిపోయినట్లు వేనవేలు కొండలను చెండ్లవలె నాడించిన వానికిఁ దుదనొక గువ్వరాయిచే వ్రేలు విఱిగెనన్న నాశ్చర్యముగా నున్నయది ఏమీ! రుధిరము కూడా కారుచున్నదే ?

ఆంజ — చిత్తము సూదిగా యుండుటచే గుచ్చుకొన్నయది. దేవా! మూడవసారి కూడా యత్నించెద. ఇఁక బ్రహ్మరుద్రేంద్రాదులువచ్చి యడ్డినను నూడి తీఱవలె. ఇదిగో వాలము. దీనిప్రతాపము మీ తెలుఁగునది కాదు. అయినను వినగోరెద.

సీ. పంక్తికంఠునిముందు భద్రాసనంబయి,
పటుగౌరవము!గొన్న వాలమిద్ది
అలఘులంకాపురి నగ్ని కర్పింపఁగ,
కోలదివియయైన వాలమిద్ది

సౌమిత్రిమూర్ఛాంద సంజీవిఁగొని తెచ్చి,
బాళిమీఁ జేఁగొన్న వాలమిద్ది
లెక్కలేనసురుల నొక్కచుట్టగఁ జుట్టి,
వార్థికి విసరిన వాలమిద్ది
తే. గీ. జంతుతతికెల్ల బ్రీతియై సంభ్రమిచ్చి
పరమ సౌందర్యమునుఁ గూర్చు వాలమిద్ది
దేవ! యిట్టివాలంబుచే గూవటాతి
నొక్కపెట్టున పెకలించి యుసియొసర్తు.

ఇదేచూడుఁడు (వాలమును గూవటాతికిఁ జుట్టిపెట్టి) చూచుటయే కాదు యూఁచినదనుకొండు. ఊడుటయే కాదు నా కాలిక్రింద పిండిగా నైనదని భావించుఁడు (లాగుటయభినయించి) హుం. హుం. [అని గుంజి వెల్లకిలఁబడి మరల లేచును)

శ్రీ రా—అయ్యో! పావనీ! అదియేమి? నేలపైఁ బడిపోతివేమి? (సమీపించి) అన్నన్నా! నీవాలము సేతుప్రవాహమై చూపరులకు భీతావహముఁ గొల్పుచున్నయది ఆహా! యద్భుత మద్భుతము.

చ. కరములకున్ బదంబులకుఁ గ్రమ్మర పుచ్ఛము రోమరాజికిన్
గురుతరమైన శైలతతి కోటులు మోటులు కట్టు కట్టినన్
బరపఁగ నాకవీథిఁబడి ప్రబ్బుచు కేరుచు నేగినట్టి యా
పరమవజీరు కొక్కయిపెట్టి పెకల్చుట గూవటాతినిన్

చూడుము నేనూడా యత్నించెద. [అని పాదుకడెక్కతోఁ దన్నగా నూడి కొద్దిదూరములోఁబడి అందుండి యొక తేజము రాముని కుక్షియందు ప్రవేశించును)

ఆంజ—(నివ్వెరపడి) మహాత్మా! శ్రీరామచంద్రా! ఆగువ్వాయినుండి వెడలిన మహాతేజము మిగుల నైల్యకాంతికలదై నాకన్నుల మిర్మిట్లుకొల్పి నాకుగల గర్వముఁబర్ణమడఁచి వైచినది. ఆతేజమేమిటి

యో, ఆరాయికెట్లు కలిగినదో వచించువఱకు మీపాదారవిందముల నుండి లేచుటలేదు. (అని రాముని పాదములపైఁబడును)

శ్రీరా—వాయుజా! తెలిసికొనుము. లేలెమ్ము (అని లేవనెత్తి) దానిసంగతవినుము

ఉ. సత్త్వరజోతమంబనెడి సత్త్వమునే పరమాత్మయంచు నా
తత్త్వవిదుల్ వచింతురు యదార్థమె యాపరమాత్మయందునన్
సత్త్వము బ్రహ్మగాఁ రజము శౌరి, తమంబు భవుండెయౌచు మేల్
సాత్త్విక రాజసంబు తమసంబను తేజ గుణంబులెవ్వరిదే

అదివిరాట స్వరూపమునందలి రాముఁడెటువంటి యంశకలవాడో మహేశుఁడు కూడా యట్టివాఁడేయని యెంచక మున్నొకసారి యమ్మహనీయున వెప యుపచారం బొనర్చితివి. అది యెప్పుడంటివా!

చ. దశకంఠున్ బరిమార్చుటద్ది ద్విజహత్యాపాపముప్పారగా
నశియింపంగ శివప్రతిష్టకయి నిన్నాకాశికిన్ లింగమున్
కృషిచేదెమ్మని పంప నాహనుమకీ వేతించ లేకుండినన్
కుశలత్వంబున నన్ను లింగమును సేకూర్మిఁ బ్రతిష్ఠింపనే

ఆంజ.—మహాత్మా! ఆసంగతి జ్ఞాపకమున్నది. తాము ప్రతిష్ఠించుటచే రామలింగేశ్వరుఁడనియును నాపురమునకు రామేశ్వరమనియును నామములు కలిగినవి.

శ్రీరామ—అంత కొన్నినిమిషంబులకు మహేశ్వరలింగముతో నీవు ప్రవేశించి నాచేఁ బ్రతిష్టయయియున్న లింగమునుగని కోపము నొంట నీచే గొనిరాబడిన లింగమును స్థాపింపమనియును దానినిదీసి పారవేయమని కోరితివి. అందుపై నీవే యాలింగమును నూడదీయుమనిగా నప్పుడు గూడ యిప్పగిదనే నీహాలముచే పెంలింప యత్నించి

విఫల మనోరథుఁడవైతివి. ఆవాలముయొక్క రక్తధారఁ బడినచోట భూమియంతయు నెఱ్ఱవారి నేఁటివఱకు వర్ధిల్లుచున్నది. తరువాత నీవు కొని తెచ్చిన లింగమును బ్రతిష్ఠించి ముందుగా దీనినిఁ బూజించినపిమ్మట నాచేఁ బ్రతిష్ఠింపఁబడిన లింగమును బూజింపవలెనని వరమిచ్చి యుంటిని

ఉ. అప్పుడు నీవొనర్చిన మహాగ్రహమున్ మదినెంచి, మించి నీ
కిప్పగిదిన్ మహత్త్వము నొకించుక జూపిన నావజేంద్రి పెం
గొప్పగ నీశ్వరార్చనము కూడ నొనర్తువు గర్వమీఁగ నే
చొప్పున నీకు తత్ప్రభను జూపెభేదము నేనె యాతఁడో

అతఁడు తమోగుణుఁడగుటచే వాని తేజము నీలమై కాఱిలును ఆ తేజమె నాలోఁ జొచ్చినది. అది సూవరాయి కాదు. అదియొక మాయలింగము. నేను దానిని పాదుక డెక్కతో దన్ననేలేను నీకుమాత్ర మట్లు కనబఱచితిని.

అంజ—మహాత్మా! శంకరుని ప్రభావమేనెఱుంగని వాఁడను గాను

సీ. శమనంబనగ సుఖమమర జేయుటయందు
శక్తి కలుగుటచే శంభుఁడయ్యె
శివమనగ శుభంబు చేకూర్పఁగలయట్టి
దక్షిణంబు కలుఁగుట శివుఁడు నయ్యె
రుదితంబనఁగ దుఃఖ మదియంటకుండఁగా
బోధించు ధన్యుఁడగాన రుద్రుఁడయ్యె
హరియించి మఱి పీక హరుసంబుఁ గూర్చుచు
నాశ్రితులను సాఁక హరుఁడునయ్యె
తే. గీ. వాస్తిగైశ్వర్య యుతుఁడౌట ఈశుఁడయ్యె
ఉగ్రవర్తియై చరియింప నుగ్రుఁడయ్యె

స్థాత కల్పాంతమునఁ గూడ స్థాణుఁడయ్యె
దేవతులలో మహానుఁడు మహాదేవుఁడయ్యె.

అట్టివానిని నేనెట్లు తిరస్కారభావమును జూపుదును. అమ్మహనీయునికిమాత్రము తెలియదా? మహాత్మా! మీయిరువురకు భేదమున్నదా.

చ శివుని స్వరూపమేయగును చెప్పఁగ విష్ణువు, విష్ణురూపమే
శివుఁడగు, ప్రిబ్బుగా శివుని చిత్తమునందున విష్ణు, వెంచవి
ష్ణువు మనమందునన్ శివుఁడు చూడఁగ నాశివకేశవుల్ మయం
బవ్వట జగంబు, నిర్వురకు హస్తు నమస్కృతి సల్పనేరికిన్.

కావుననే మహాపురుషులు శివకేశవపరంబగు భగవంతుఁడు వేలుపుదైవములను శబ్దములను వాడఁజొచ్చిరి

రాము—వాయుజా! పశ్చాత్తాపమునొందితివి గాన నీకిక పాపములేదు. నీకిచ్చినవరముప్రకారము రాముపట్టాభిషేకము జూపెట్టెద.

(అని రాముఁడు నిష్క్రమింప మరల యింకొక తెఱలేచును)
(భూమిజ వామపార్శ్వమునందు కూర్చొనియుండ భరతుఁడు ఛత్రము లక్ష్మణశత్రుఘ్నులు చామరములుబట్టి విభీషణ సుగ్రీవాదులు కైవారములు సలుప సప్తమహాఋషులు వేదములు చదువుచుండ రాముఁడు పీఠముమధ్య కానుపించును.)

ఆంజ—జానకిరామా! రాఘవరామా! దశరథరామా! ఎన్నినాళ్ళకు మరల నీపట్టాభిషేకమును గంటిని. (దోసిలొగ్గి]

తరల. అనఘుఁడవ్యయుఁ డచ్యుతుండ మహానుభావుఁడ మేయుఁడా!
ఘనుఁడనంతుఁ డతీతుఁడా! యవికారుఁ డక్షరనిత్యుఁడా

ఇనకులేశ్వర! ఈశ్వరుండవ హీసుతప్రియ నాయకా
ప్రణతి రాఘవరామ! సుందర రామయాఖ్యుని వేలుపా!
(అని నమస్కరించి) హేమాతా! ధరణీజాతా! నీవొక ఆదిశక్తివి అదివిరాట్స్వరూపుండగు మా ?మచంద్రమూర్తికి నాతివై సీతయను నామముతో భూజాతవై ఖ్యాతిని సంపాదించితివి. తల్లీ జగజ్జననీ! నీ చారిత్ర మద్భుతము. నీశక్తి యతివిచిత్రము ఏమన?

మానినీవృత్తము.

రక్తి జగత్తను నాటకశాలను ప్రాణిచయంబును పాత్రలుగా
యుక్తిగ బన్ని సుశక్తిని కూర్చి ప్రయుక్తుల చేసను శక్తిని వే
త్యక్తముగా సలిపాడయిపోరును నల్వురజేసి లయింతువనీ
శక్తినుతింపగ సుందరరామయ శక్తుడను ?ముని భక్తుడ కాక
ఓసీతారాములారా! మజ్జననీజనకులారా! నా మొఱవినుండు

కవిరాజ విరాజితము.

ధరణిజ! రాఘవ ధాత్రిజరామను స్వప్నమలోకుటి దైవమునే
స్మరణ మెరుంగక సల్పుచు మీపదభృత్యుడనైయరె శ్రద్ధగను
త్తర సలిలాబ్ధిని తత్తటమందున తాపసినై మది ధ్యానముతో
పొరదనిగొల్చెన సుందరరామయ సుహృదివాసవిశుద్ధమతుల్

సీత—వాయుజా! నీభక్తికి, నీశక్తికి, నీయుక్తికి, నీవ్యక్తికి, నేరక్తిమై మెచ్చితి! నీకేమివలయునో కోరుకొనుము.

ఆంజ—తల్లీ! నీదయవలన నాకేమిలోటులేదు కాని యొక్కటిమాత్రము ప్రార్థించెద అది యొద్దయంటిరా!

మత్త. సత్యలోకము పాలనంబును సల్పబుద్ధి జనించెనా
చిత్యమా? యిదిగోరుటంచ వచింప మారువచింప మీ

భృత్యకాంక్షను దీర్తురంచును వేడెదన్ గృహవేల్పులై
సత్య సుందరరామయాఖ్యుని సాకుచుట్టి మహాత్ములన్.

శ్రీరా—ఓయీ! వాయుజా! మనుష్యమాన ప్రకారము కలియుగమునకు నాలుగులక్షల ముప్పదిరెండువేల వత్సరములు దానికి రెట్టింపు ద్వాపరము ప్రమాణము కలిగి మూడురెట్లు త్రేతాయుగమున కాయువు కలిగి నాలుగురెట్లు కృతయుగముయొక్క కాలపరిమితి మొత్తము నలుబదిమూడులక్షల యిరువదిరెండువేల సంవత్సరములు. ఇది బ్రహ్మకొక్క పగలు. ఇట్టికాలమే యాతనికొక రాత్రి ఇట్టి రేయింబవళ్ళు మూడువందలయరువది దినములాతని కొకవత్సరము. అట్టివత్సరములు వేయిగలది వానికాయువు పరిమితి. ఇటులాతండు వేయిసారులు పుట్టిగతించిన పిమ్మట నీకు సత్యలోకాధిపత్యము వచ్చును. అప్పుడు నీవు విధాతగతిగా నంతకాలము పరిపాలించెదవు.

సీత—ఓయీ! నీకు సమ్మతమేనా?

ఆంజ—జననీ! కాకేమిటి? అంతవరకు మరల యుత్తర సముద్రతీరమున జపమాచరించుకొనుచుండెద. రాబోవు:—

చ. కలియుగమందు నేనొరులకంటికి గన్పడకుండునట్టి లా
లలితపు నుత్తరాద్రికి చొరంబడుచుండెడి యట్టి మానిసుల్
చెలగుచు నివ్వరంబు దయసేయుడి యోతల్లిదండ్రులార! ఉ
త్తలపడు మీకుమారునకు తాపసినై చరియించు దత్తటిన్.

సీతారాములు—తథాస్తు తథాస్తు

ఆంజ—జననీజనకులారా! మరియొకటి వేడెద.

ఉ. పాయక రామరావణ ప్రభావ దురంబు కరంబు మీరి రా
మాయణ గ్రంథరాజమయి మానవకోటికి పూజనీయమై
శ్రేయము సంపదల్ సిరియు చేకురునట్లు పఠించువారికిన్
హాయిగ నిల్చునట్లు కలియంతిముదాక వరంబొసంగుడీ.

సీతారాములు—తథాస్తు. తథాస్తు.

ఆంజ—ఓతల్లిలందఱిలారా! నేనుకూడా యీభరతఖండమున జన్మించియుంటిని గావున నాకును నాజన్మభూమిపై మిక్కుటమగు కూర్మియుండుట సహజధర్మము ఆకారణమున తాము భారతమాత నీక్రింది విధముగా నాశీర్వదింపఁగోరెదను.

ఉ. ధారుణి పాడిపంటలకు దానము లక్ష్మికి వాసికెక్క యిం
పారగ నన్ని చేతిపనులందున ముందుగ నారితేఱియే
పేరున నన్యఖండముల సాయము సంపద గోరకుండగా
భారతమాత తాఁ బ్రజల వైభవవార్ధిని నోలలార్చుతన్

సీతారాములు—తథాస్తు. తథాస్తు. తథాస్తు

గద్య—ఇది శ్రీమద్వేణుగోపాల చరణారవింద మరంద తుందిలేందిందిరాయమాన మానసోదరై నాపురాన్వయ క్షీరనీరాకర రాకాసుధాకరబాప నార్యపౌత్రి సోమరాట్సుపుత్రి భారద్వాజసగోత్రి పవిత్రి కాత్యాయనీసూత్రి విచిత్రి సుందరాంబా గర్భశుక్తి ముక్తాఫల విధుభజన విధేయ సుందరరామయ నామధేయ ప్రణీతంబైన గర్వభంగంబను నాటకరాజంబుసంపూర్ణము.

శ్రీవేణుగోపాలార్పణమస్తు.



# చండిక.

(ప్రదర్శనానుకూలమగు 5 అంకముల నాటకము)

గ్రంథకర్త — తులసీదేవి (సతీతులసి) నాటకము రచించిన ముత్తనేని వేంకటచెన్న కేశవులు, జగ్గయ్యపేట. వెల రు 1—0—0 మాత్రమే.

చండిక స్వాతంత్ర్య మంటప ప్రదీపిక, చండిక సౌందర్యవార్ధి సమృద్ధి చంద్రిక చండిక సముదారాతిద్రుమ కుఠారిక, చండికా చరిత్రమతి విచిత్రము! సూక్ష్మదృష్టిం బరికించువారికిఁ జండిక భామినీరూప బ్రహ్మరాక్షసి! కామినీరూప మృత్యుదేవత, స్థూలదృష్టిం బరికించు వారికిఁ జండిక వీరపత్నీశిరోరత్నము! పరమసాధ్వీతిలకము. చండిక కౌక్షేయముతోఁగాని పనిఁగటాక్షముతో నెరవేర్చినది. కత్తిబట్టుకొని కదనరంగమున కుఱికినది. రక్తముగార్చి రాజ్యము సంపాదించినది. చండికకు స్వాతంత్ర్యమే స్వర్గలోకము. పారతంత్ర్యమే ఘోరనరకము. భర్తృస్వాతంత్ర్యమునకుఁ జండిక పడినపాట్లు చెప్పినదీఅవు. పతినిబ్రభువుం జేయుటకుఁ జండిక పన్నిన తంత్రములు వర్ణనాతీతములు! పతిహితవర్తమే చండికకు పరమధర్మము. భర్తకొఱకుఁ జండిక పాపశీలిపడిచినది, ఘోరహత్యలు గావించినది! పాంసులయను దుష్కీర్తి నందినది తుదకు భర్తకు రాజ్యమార్జించినది, కానికట్టకడకు చండికకు బైటకొంగే ప్రాప్తమైకఱచినది. భర్త మొపగఁదలంచి చండికను పగతుర కప్పగించినాఁడు, ఆభిజాత్య సంపన్నయగు చండిక ఆత్మహత్య గావించుకొనినది. ఇంతటి సాహసిక—ఇంతటివీర కాంత—ఇంతటి కౌఱ జాణ—చరిత్రము మీరెవఱుఁ గనివినియుండరు. దీనిఁబఠించి యానందింపుఁడు. ప్రదర్శనానుకూలము, కొన్నిగొన్ని పద్యములు.

శా. పాణిన్ఘోరకృపాణిఁబూని బలవత్ప్రత్యర్థి భూభృద్భట శ్రేణిందాఁకి, యసృక్ప్రవాం
పరల, నుచ్చంగార్చినంగాకఁ యీక్షోణిరాజ్యము శూరభోగ్య మెటువచ్చున్ ముం
దఁటిండ్లలో, బ్రాహ్మణాశంబడి వేడిమురువులఁ గార్వన్ క్షత్రియ గ్రామణీ!

గీ. కత్తిఁబట్టకున్న నెత్తురోడ్చకయున్న, ఘోరబాధ లొంద । నేరకున్నఁ
బ్రాణహింససేయఁ బాల్పడకున్నను లభ్యమానె రాజ్యలక్ష్మియైనక.

ఉ. వారధిలోన మీనములు వర్తిలుచుండ తిమింగ ప్రోడ్చెలున్ । భూతలగాంధ్య దుంప
నల్పూసల నేరెము జాణలున్, బపల్ తారలలెక్కఁడంగలుగు దంటలు ధాత్రిఁగ
లారు లేరు వో నారుల చిత్తవృత్తులఁ గనఁదగు నేర్పుగంట్రి కిట్టరున్.

గీ. ఊహలఁబోని బిఱబిగిపెడు నువిదలొకట । బ్రతుకులాపుట పురుషుల భంగిమావె
ఆ! యనుచుఁ దలయూడించు నరిపఁజూచి దూరమేఁగుట పసిపుల తోవ దేవ.

ప్రతులకు—

సరస్వతీ బుక్కు డిపో. బెజవాడ.

BCI

# భీష్మ - బ్రహ్మచారి

అను

# సంపూర్ణ భీష్మ చరిత్ర

గ్రంథకర్త— సోమరాజు రామానుజ రావుగారు.

బెజవాడ మైలవరం కంపెనీవారిచే ప్రదర్శింపఁబడుచున్నది.

విజితేంద్రియుఁడును, భారత కథా పితామహుఁడును, శాశ్వత బ్రహ్మచర్య నిష్ఠుఁడును అగు భీష్మ బ్రహ్మచారి నామమును విననివారు హిందువులలో నుండరు. అష్టవసువుల శాపము మొదలుకొని, గంగకు అష్టమ వసువు జన్మించుట— సత్యవతీ నామాంతరయగు మత్స్య (యోజన) గంధిని భీష్ముని తండ్రియగు శంతన మహారాజు మోహించుట— తండ్రి సౌఖ్యమునకై భీష్ముఁడు వివాహమును మాని ఘోర ప్రతిజ్ఞం దాల్చుట— కాశీరాజ పుత్రికల స్వయంవర కథ— భీష్ముడా ముగ్గురు కన్యలను బలిమిం దెచ్చి— విచిత్రవీర్యునకు పెండ్లిచేయ దలచుట— వారిలో అంబ తన హృదయము సాళ్వునిం దవిలి యున్నదని చెప్పి ఆతనికడ కేగి నిరాకరింపబడి ఉభయభ్రష్టురాలై పరశురామునితో తన కథను జెప్పుట— భీష్మ పరశురాముల యుద్ధము పరశురాముడు ఓడిపోవుట— అంబ అగ్నిలో బడుట— విచిత్రవీర్యుని మరణము— ధర్మ సంతాన విషయము— భారత యుద్ధము— అంబ శిఖండిగా జన్మించి భీష్ముని మృతికి కారణ మగుట— భీష్ముడు అంపశయ్యపై కాలుంటువరకును సంపూర్ణ చరిత్రము 3 గంటలలో ప్రదర్శింప దగియున్నది.

పార్శీ నాటకముల పద్ధతిని రంగరంగమునకు నడుమ దాశరాజు విషయమైన హాస్య కథ కడుపుబ్బ నవ్వించుచుండును. దాశరాజు స్వయంవరమునకు పట్టు, చేసిన అల్లరి. హాస్యరసము మిగులనుండ పూర్తి చేసినది.

ప్రతి పద్యమును పాఠము చేయ దగియున్నది. భీష్ముని పెండ్లి యాడుమని నర్సుడు చేసిన వేదాంత చర్చ మిగుల ప్రశంసనీయమై యున్నది. భీష్మ పాత్రము యొక్క గౌరవము శౌర్య-ధైర్య వైరాగ్య విషయములం దెందుచూచినను తీసిపోవని రీతిని పోషింప బడినది.

వెల రు 1—0—0 మాత్రమే

వలయువారు—

సరస్వతీ బుక్కు డిపో, బెజవాడ

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA107B176 |
| పుస్తకం పేరు | గర్వభంగము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |